ఇది

విద్వాన్

ములుగు చంద్రమౌళి శాస్త్రి గారిచే

రచియింపఁబడిన

7 అంకముల నాటకము.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

ప్రకాశకుఁడు

తోట వేంకటాచలదాసు

ఎడిటర్, పబ్లిషర్, అండ్ బుక్ సెల్లర్,

సుబోధినీ గ్రంథనిలయము

తెనాలి

రజత ముద్రణాలయము.

1924.

చందాదారులకు రు 0-12-0 ఇతరులకు రు 1-0-0

ఆచంట.

,, ... న్ద్రిగారు, ,,

,, చింతా పల్లయ్యనాయుడుగారు, రాజమండ్రి.

,, రావుల గోపాలకృష్ణయ్య పంతులుగారు,
డిప్యూటీ నాజరు, తెనాలి.

,, కాకుమాను వుళ్లక్కిగారు, యం.బి.సిహెచ్.బి. తెనాలి

,, గోవిందరాజుల వేంకటసుబ్బారావుగారు,
యల్.యం.యస్. తెనాలి

---

# ప్రధానపోషకులు

మ.రా.రా.శ్రీ సంకా వీరభద్రయ్య శ్రేష్ఠిగారు, తెనాలి.

,, కొమ్మూరి చినహనుమంతరావు శ్రేష్ఠిగారు ,,

,, పెద్దిభొట్ల రామయ్యగారు, ,,

,, మారొతు కోటయ్య చౌదరిగారు, పేరకలపూడి.

,, వాశిరెడ్డి కోటయ్య చౌదరిగారు, చినపాలెం.

,, కన్నెగంటి వేంకటరావు చౌదరిగారు, నందివెలుగు.

,, చదలవాడ వుమామహేశ్వరరావు చౌదరిగారు,
పెదపూడి.

,, గవిని శాయన్న చౌదరిగారు, జంపని.

,, సుంకర పున్నారాయుడు చౌదరిగారు, పల్లెకోన.

,, కామిశెట్టి రాజారావు నాయుడుగారు, తెనాలి.

,, అళహరి శేషాచలం నాయుడుగారు, ,,

,, పిల్లలమర్రి చినసోమయాజులుగారు, ,,

Presented to
Kodamata Rama Grandhalayam.
Telaprolu.
(Kistna) Dist
Gannavaram

పోషకులు

మ.రా.రా.శ్రీ చుండూరు కామయ్య శ్రేష్ఠిగారు, తెనాలి.
" చుండూరు చినసాంబయ్య శ్రేష్ఠిగారు, "
" చుండూరు రామమూర్తి శ్రేష్ఠిగారు, "
" గుండాబత్తుల కుమారస్వామి నాయుడుగారు, "
" అనుగోలు రుద్రయ్య నాయుడుగారు, "
" భమిడిపాటి వేంకటరమణయ్యగారు, "
" గుదిమెళ్ల రామానుజాచార్యులుగారు, "
" పసుపులేటి తాండవకృష్ణయ్య నాయుడుగారు, గుంటూరు.
" పి. వి. రాఘవాచార్యులుగారు, ఉప్పలూరు.
" వేమూరి బక్క రామయ్య నాయుడుగారు, తెనాలి.
" తిమ్మరాజు సుందర రామయ్యగారు, గుంటూరు.
" రాయడు వెంకటసుబ్బారాయుడుగారు, తాడేపల్లిగూడెం.
" యల్లాప్రగడ సుబ్రహ్మణ్యశర్మగారు, పెదపల్లి.

---

# సీమంతిని.

# ప్రకటన

## సుబోధినీ గ్రంథ నిలయము తెనాలి

మావద్ద విక్రయమునకు సిద్ధముగనున్న గ్రంధరాజములు.

కందుకూరి వీరేశలింగంపంతులుగారి వాల్యుములు

10 మావద్దకలవు. వాల్యూము 1-కి రు 3-0-0

పదివాల్యూము లొక్కసారికొనువారికి రు 25-0-0.

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి సాక్షి 4 భాగములు

4 భాగము లొక్కసారికొనువారికి రు 7-0-0

## అత్యద్భుతములగు డిటెక్టివ్ నవలలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | మనోరమ | 1-12-0 | 17 | నేనే | 1-8-0 |
| 2 | మాయావి | 1-8-0 | 18 | కాలూరాయి | 1-12-0 |
| 3 | మాయావిని | 0-12-0 | 19 | కోటీశ్వరతనయ | 1-8-0 |
| 4 | నీలాంబరి | 1-8-0 | 20 | వేంకటరావు | 1-8-0 |
| 5 | జీవన్మృతరహస్యం | 1-8-0 | 21 | ఘోరప్రతిక్రియ | 1-8-0 |
| (6) | రహస్యవిప్లవము | 1-8-0 | 22 | నరాధమ | 1-4-0 |
| 7 | అపరాజిత | 1-8-0 | 23 | హత్యారహస్యము | 1-8-0 |
| 8 | ప్రతిజ్ఞాపాలనము | 1-8-0 | 24 | చోరశిఖామణి | 1-8-0 |
| 9 | మరకతమంజూష | 1-8-0 | 25 | మృత్యురంగిణి | 1-0-0 |
| 10 | జయాపజయములు | 1-8-0 | 26 | అగ్గిరాముడు | 0-12-0 |
| 11 | పరమరహస్యము | 1-8-0 | 27 | సాంఘికదౌర్జన్యం | 1-0-0 |
| 12 | రజని | 1-0-0 | 28 | చిత్రలేఖ | 0-12-0 |
| 13 | పరిమళ | 1-0-0 | 29 | కన్నపుదొంగ | 0-12-0 |
| 14 | సాధన | 0-12-0 | 30 | పగటిచుక్క 1 భాగం | 0-12-0 |
| 15 | లక్షరూపాయిలు | 0-12-0 | 31 | ,, 2 భాగం | 0-12-0 |
| 16 | వాడేవీడు | 1-8-0 | 32 | మంగళసూత్రం | 1-8-0 |

వలయువారిట్లు వ్రాయవలయును: టి. వి. సి. దాసు,

ఎడిటర్, పబ్లిషర్ అండ్ బుక్కుశెల్లరు,

సుబోధినీ గ్రంధనిలయము, తెనాలి. గుంటూరుజిల్లా.

శ్రీరస్తు.

# సీమంతిని.

---

## కథాసంగ్రహము.

యమునా నదీతీరమున అరుణాస్పదమను పురము కలదు. ఆపురమునకు చిత్రవర్మయను నృపాలుడు పాలించుచుండెను. అతనికి భాగ్యవశమున త్రిపురసుందరీదేవి ప్రసాదమున సీమంతినియను పుత్రిక కలిగెను. చిరకాలమునకుఁ గలిగిన యాసీమంతిని నెక్కువ ప్రేమతో బెంచుచు పదునాలుగేండ్లు వచ్చునప్పటికి తలిదండ్రులామెకు సర్వవిద్యల నుపదేశించిరి. ఇట్లుండ నొకనాఁడు చిత్రవర్మ సీమంతిని జాతకమును దైవజ్ఞులకు జూప వారాజాతకము దుష్టగ్రహ సంకులమగుటచే ఈజాతకురాలికి వివాహమైన కొలది కాలములో వైధవ్యము కలుగునని చెప్పిరి. అందులకు రాజదంపతులత్యంతము చింతించుచుండ యాజ్ఞవల్క్యముని శేఖరుడరుదెంచి వారి నోదార్చి సీమంతినికి భర్తృవియోగము గ కుండ నొక సోమవారవ్రతము నుపదేశించెను. సీమంతిని గురూపదిష్టమగు సోమవారవ్రతము నాచరించుచుండు నెడ మైత్రేయుడను ముని వచ్చి చిత్రవర్మ తనను బరామరిక చేయలేదను కోపమున సూచించి మీరాచరించు వ్రతమును భంగము గావింతునని పలికిపోయెను. అట్లు బలికి తనయాశ్రమమునకు జని మైత్రేయముని తాను నిష్కారణముగ సీమంతినిని వ్రతభ్రష్టురాలినిగ జేతునని పలికినందులకెంతయు బశ్చాత్తాపమునొందియు తనమాట చెల్లించుకొననెంచి ముందుగా నామెను నయమున బరీక్షింపదలచి యామెకు నిషధాధిపతియగు చంద్రాంగదుని బూనినదని తలచి యుద్ధయాత్రాభిముఖుడగు నాతనికి మృగయాప్రయాణమును గల్పించెను. చంద్రాంగదుఁడు వేటకైయరిగి వేటాడి మృగయుల నింటికిబంపియుండుతరి నాతనికడకొక సింగపు బిల్లవచ్చుటచే దానిని బట్టుకొందునని వెంబడించెను. ఆసింహము చంద్రాంగ

దుని యమునా సమీపారామమున విహరించు మధురికా సీమంతినుల కడకుగొనిపోయి యదృశ్యమయ్యెను. చంద్రాంగదుడు తన చిత్రపటమును జూచి వర్ణించుచున్న సీమంతినినిగాంచి మోహపరవశుడై యుండెను. మధురిక చంద్రాంగదునకు సీమంతిని వృత్తాంతముజెప్పెను. సీమంతినిచే చంద్రాంగదుడు సత్కరింపఁబడి జ్ఞాపకార్థము తనయుంగరమామెకొసగి మరల సమాగమ మగుగాకయని వెళ్లిపోయెను. సీమంతిని విగహావస్థ. సుమేధసుడు మైత్రేయునితో తానుజేసినసీమంతినీ చంద్రాంగదుల సంఘటనము జెప్పుట. అరుణాస్పదపురమున దిరుగుచున్న సింగపు గొదమను చంద్రాంగదుడు పట్టుకొనుట. భటులు చంద్రాంగదుని రాజదర్శనమునకు గొనిపోవుట. చిత్రవర్మ సీమంతినిని చంద్రాంగదునకిడి వివాహముజేసి సోమవార వ్రతమునకు వార్షికోత్సవముజరుగు వఱకాతని నరుణాస్పదపురము నందేయుండ నియమించెను. లోకోత్తరుడునగు భర్తనుగూర్చినను తన శపథమున కనుకూలముగ వ్రతపరిత్యాగము జేయకుండుటచే సీమంతినిపై గినిసి మైత్రేయుడు తన శిష్యుఁడగు సుమేధసుని బిలచి సోమవంతునితో గూడి కృత్రిమదంపతులై సీమంతినివలన బూజింపబడిరమ్మని చెప్పుట సుమేధసుడు సోమవంతున కనేకరీతులజెప్పి కృత్రిమాంగనా రూపము దాల్పించి సీమంతినికడ పూజింపబడెను. అట్లుపూజింపబడి యామెను బొగడుచువచ్చుచుండ సోమవంతు డాసీమంతిని ప్రభావమున స్త్రీయై విరహావస్థనొంద సుమేధసుడెరిగి తనకు గలిగిన పరాభవమునకు దుఃఖించి మైత్రేయముని సమీపమునకు బోవుట. ఇదియట్లుండ చంద్రాంగదుడు మిత్రుడగు గౌతముడును సీమంతినియు వెంటరా యమునానదిలో పడవమీదనెక్కి విహరింపబోవ పడవ మునుగుట. సీమంతిని గౌతములు దైవయోగమున దరికిజేరి చంద్రాంగదుడు మరణించెనని విలపించుట. చంద్రాంగదుఁడు పాతాళలోకమున కేగి తక్షకునితో సంభాషించుట. తక్షకుడు రాజకుమారుని మాటలకుకోపించి యాతని జంపబోవ అశరీరవాణి నివారింప తక్షకుడు పశ్చాత్తాపమున రాజ

కుమారు నాలింగనముజేసుకొని గౌరవించి భూలోకమునకు బంపుట. తానాచరించు సోమవార వ్రతము ఫలమొసగగలదను నమ్మకమున సీమంతిని సహగమనము జేయక చంద్రాంగదుని దర్శనమెన్నఁడు గలుగునా యని చింతించుచు నొక సోమవారమున స్నానమునకై యమునానదికి బోవుచుండ మైత్రేయుడు వచ్చి సీమంతినితో సోమవార వ్రతమును విడతువేని నీపతి బ్రతుకగలడని చెప్పుట. సీమంతిని మైత్రేయుని నిరాకరించి పోవుచుండ నొకపొదలోనుండి చంద్రాంగదుఁడు బయలుదేరి సీమంతినిని గుర్తుపట్టి కౌఁగలించుకొని పట్టణములోనికి పోవుట. చంద్రాంగద మార్తాండులయుద్ధము. చంద్రాంగదుఁడు మార్తాండుని జంపుట. పట్టాభిషేక మందిరమునకువచ్చి మధురికసీమంతినితో నెవరో దుర్మార్గులు నీవ్రతము భంగజేయ కుటిలదంపతులై నీవలన బూజింపబడిరని వదంతికలిగినదనిచెప్ప సీమంతిని ప్రాణత్యాగము జేయదలచుట. మైత్రేయుడరుదెంచి నివారింపబోవ సీమంతిని యాతనిని దిరస్కారము జేయుట. శంకరుడు ప్రత్యక్షమై సీమంతిని భక్తికిమెచ్చి యనేక వరములొసంగుట.

భరతవాక్యము.



# ఈ నాటకమందలి పాత్రములు.

## పురుషులు.

సూత్రధారుఁడు
పారిపార్శ్వకుఁడు
చంద్రాంగదుఁడు (కథానాయకుఁడు)
చిత్రవర్మ (సీమంతిని తండ్రి)
మార్తాండుఁడు (శత్రురాజు)
దక్షకుఁడు (పాతాళలోకేశ్వరుఁడు)
మంత్రి
యాజ్ఞ్యవల్కి (చిత్రవర్మగురువు)
మైత్రేయుఁడు (ఒకముని)
సుమేధసుఁడు } (మైత్రేయుని శిష్యులు)
సోమవంతుఁడు } (మైత్రేయుని శిష్యులు)
గౌతముఁడు (చంద్రాంగదుని మిత్రుఁడు)
కంచుకి
పడవవాండ్రు
శంకరుఁడు (వ్రతాధిదేవత)

## స్త్రీలు.

సీమంతిని (కథానాయిక)
మధురిక (చెలి)
ఇందుకళ (సీమంతిని తల్లి)
సోమవతి (కృత్రిమాంగన)
నాగకన్యలు



## మీనాక్షీసహిత సుందరేశ్వరాయనమః

## ఇష్టదేవతాప్రశంసనాదికము.

చ॥ శ్రితజన రక్షణాభిరతిఁ ♦ జేసి నిరంతరవాసమైన ప
ర్వతమున నున్కి వీడి మధు ♦ రా పురమున్ శ్వశురాలయంబుగా
సతము వసించి మాదృశుల ♦ సన్నుతిఁగైకొను సుందరేశుఁడీ
కృతి కినుఁడై కుశీలవుల ♦ కిష్టశుభప్రదిపాది యయ్యెడున్.

మ॥ తనకారుణ్యమె లోకసౌఖ్యములనో ♦ ద్యత్కారణంబై తగన్
దనసాంగత్యమె సుందరేశ్వరుని క ♦ త్యంతంబు మోదంబుగా
గను శ్రీమన్మధురాపురంబున జగ ♦ త్కల్యాణ సంధాత్రియై
యనయంబున్ వసియించుభద్రదను మీ♦నాక్షిన్ మదిన్ గొల్చెదన్.

చ॥ నిమసమయేని మమ్ము విడ ♦ నేరక కన్నులఁ గప్పికొంచు స
క్రమమగు శిక్షచేత సుక ♦ రంబగు శాస్త్రమునేర్పగించెఁ బు
ణ్యమతి యతండు మాతుఁ బిత ♦ నంగయ సూరివరేణ్యుఁడస్మదీ
యమగుఁ గవిత్వమెల్లకడ ♦ లందు వెలింగెడినట్లొనర్చెదున్.

ఉ॥ నేరనివాఁడనై చదువునేర్పెడి యొజ్జ లసహ్యమొందగా
వారలవీరలన్ గలసి ♦ వాదములాడుచు సంచరించు స
న్నారసి చేరఁదీసి యనయంబు శ్రమంపడి విద్యనేర్పె మా
భైరవమూర్తి సద్గురుఁడ ♦ పారకృపాకలితుండుగాఁడొకో.

తే॥ తనకు ఛాత్రులయెడఁ గల ♦ దయనుజూప
సకల శుభలక్షణావహం ♦ బయగుఁ గవిత
నొకొసంగెను ముదిగొండ ♦ నాగలింగ
శాస్త్రిగారికి నానమ ♦ స్కారశతము.

శా॥ ఏనల్పజ్ఞుఁడనౌట నాకవితయం ♦ దేదోషముల్ గల్గినన్
వానిన్ బోకడఁబెట్టి యీకృతియె యా ♦ నందంబుతో గన్గొనన్
మీనైపుణ్యము వేడుకొందు నెవరే ♦ నిన్ బీనవక్షోజన
మ్రానూనాంగిని గౌరవంబు మెయి ని ♦ త్యంబెత్తు మద్గాడరే.

విద్వాన్ ముఁలుగు చంద్రమౌళిశాస్త్రి.

# సీమంతినీనాటకము.

## ప్రథమాంకము.

## నాంది

చ॥ జలముల మున్గినన్, గుటిల ♦ సంతతి పైకొనినన్, మహాపదల్
గలిగిన, నైజతత్వ మబ ♦ లాత్వము నొందిన, ఘోరపన్నగా
వళి తన చుట్టు ముట్టినను ♦ భావవికారము నొందకుండు నా
రలమెడఁ గల్గునట్టి వ్రత ♦ రాజము మాకు యశంబుగూర్చుతన్.

తే॥ అలరు దక్షుని కతన గా ♦ హాస్థ్యపదముఁ
దగిలి సీమంతినీసతి ♦ దారిసేయ
భుజగనాథునితోడ సం ♦ పూర్ణమైత్రిఁ
జెలఁగుఁ జంద్రాంగదుఁడు మాకు ♦ శ్రేయమొసఁగు.

సూత్ర—(అనంతరము ప్రవేశించి పుష్పాంజలిజల్లి) ఏమి? నాయనాత్మజ్ఞత నా సామర్థ్యము నెఱుఁగకయే సకలకలా విశారదులగు బుధులకేనిఁ గష్టసాధ్యమగునిప్పనిని నిర్వహింతునని యెంచితిని?

తే॥ తనసమర్థత నెఱుఁగ కె ♦ ద్దానినైన
నలుపఁ బూనిన నజ్ఞుండు ♦ సమయుకున్నె
ప్రజ్వలించెడి వహ్నిముద్రా ♦ వంగఁబోవు
శలభ మింధనమట్లు భ ♦ స్మమగుఁగాదె.

అట్లైన నీ యచిరకాల విధృతమహాకార్యనిర్వహణప్రయత్నము నుండి తొలఁగవలసినదేనా? పండితప్రకాండ నిర్దిష్టశాసనాతిక్రమణ దోషంబావహిల్లదా? (విచారించి) అయ్యో సందిగ్ధావస్థ గలిగెనే? ఏమి చేయవలయును? (ఆలోచించి) చేయుటకేమికలదు. నాయిష్టదేవతయగు సోమసుందరేశ్వరుఁడే దిక్కు.

అట్లుగాక యీ కార్యాచరణమునుండి విముఖుఁడ నగుదునేని దుర్భరమగు నపయశము వాటిల్లును.

తే॥ కష్టమగుఁగాక లేక సౌ ♦ ఖ్య మగుఁగాక
యిష్టమగుగాక ♦ నిష్టమే యగుఁగాక
యెదియొనర్పఁగఁ దలఁచూను ♦ నది యొనర్చి
పూర్ణ సంకల్పుఁడగుట యె ♦ వ్వాఁడును వలయు.

కావున దీని కేదేని యొకసాధనము నార్జించెదను. ఆ, మఱచితిని నాకెల్లఁ బనులందుఁ దోడునీడయై నాయూననడచుఁ బారిపార్శ్వకుఁడుండ నీ విచారమెందులకు? (తెఱవంక జూచి) అదిగో కాకతాళీయముగ నాతఁడిట్లే వచ్చుచున్నాఁడు. కార్యము ఫలించినట్లే.

పారి—(ప్రవేశించి) భావా! ఈ నాఁడేలకో దీర్ఘముగా నాలోచించుచున్నట్లున్నావు కారణమేమి?

సూత్ర—ఓయీ,

తే॥ ఇతర సన్మానముంగోరి ♦ యెవ్వఁడేనిఁ
దనకు మించినకార్య మా ♦ దల ధరించి
సాధనంబు లభింపని ♦ సమయమందుఁ
జింతిలక సంతసంబును ♦ జెందగలఁడే.

అయినను జాతవేదసునకుఁ బ్రభంజనమట్లు నీవు నాకు సహాయుఁడవుగావున విచారముండదు.

పారి—సకలకార్య సాధనానుకూలోపాయ చతురులగు మీకు సహాయకరునకు మిడుఁగురుబురువు వలె నేనా సహాయము చేయువాఁడను? ఎగతాళి కట్లందువు? కాని యాకార్యమెద్దియో యెఱింగించి నాయనుమానముఁ దీర్పుము.

సూత్ర—నీవెఱుఁగవా ? రసగ్రహణ ధురీణులగు నీసభాసదు లెల్లరు సుందరేశ్వరోత్సవారంభమున నొకనాటకముఁ బ్రయోంపు మని నా కాజ్ఞయిడిరి. దానికి నీ సాయముకలిమి నియ్యకొంటిని.

పారి—ఆ నాటకము పేరెయ్యది ?

సూత్ర—ఆ నాటకముపేరు సీమంతినియందురు.

పారి—ఇంతమాత్రమున నిందలి యితివృత్తమెద్దియో బోధపడుటలేదు. ఇదిగాక యింకొకపేరెద్దియేని కలదా ? ఈ నాటకమునకు.

సూత్ర-ఆ. కలదు. ఈ నాటకమునందు సోమవారవ్రత మాహాత్మ్యము ప్రధానముగ వర్ణింపఁ బడుటచే మనిపితల్లజులు దీనిని సోమవార వ్రతమాహాత్మ్యమని కూడఁ జెప్పుదురు.

పారి—"సీమంతిని"యను నామముగూడ నన్వర్థ సంజ్ఞయేనా ?

సూత్ర—కవి లోకము తమ గ్రంథములకు సార్థకముగాని పేరిడునా? ఈ కృతియందెల్ల సీమంతినియను రాజకన్య ముఖ్యస్థానము నాక్ర మించి యుండుటవలన గ్రంథకర్త "సీమంతిని"యను పేరుఁగూడ నొసఁగెను.

పారి—ఇప్పటికి నా సందేహము తీరినది. కాని పురాతన కవుల మహా నాటకములెన్నియో ప్రసిద్ధములై యుండ నీ యపరిచిత కథానక గ్రథితమగు నూతననాటకమే యేలఁ బ్రయోగింపవలయును ?

సూత్ర—ప్రయోగించుటకు నూతనమనియుఁ బురాతనమనియుఁ బక్షింపఁబనిలేదు. కుశలుఁడగుఁ గుశీలవుఁడు రసపూరితమగు నాటకమునే ప్రదర్శించును. మత్తేభకుంభవిపాటన సమర్థంబగు హార్యక్షము నల్లిపిల్లలపై కురుకునా ?

పారి—అవునవును. దీనిని రచించిన కవియెవరు?

సూత్ర—

సీ॥ కృష్ణానదీకుల్య ♦ తీరమౌ తెన్నాలి
పుర మనయంబుఁ గా ♦ పురముగాఁగ
పులిపాక భైరవ ♦ మూర్తి సద్గురుపాద
కమలముల్ వందనీ ♦ యములుగాఁగ
సనకాదిమౌని వ్యా ♦ ఘ్రజలజస్థదక్షిణా
మూర్త్యుపాసనమె స ♦ మ్మదముగాఁగ
సకలదిగ్దేశ నా ♦ యక సమర్పితములౌ
బిరుదములు వెలలేని ♦ సరులుగాఁగ

తే॥ సకలవిధ కావ్యనిర్మాణ ♦ చతురుఁడగుచు
సాటివారలలోఁ గడు ♦ మేటియగుచు
నెసఁగు మన ముల్లు చంద్రమౌ ♦ ళీశ్వరుండు
కర్త యైయొప్పు నీరూప ♦ కమునకు కరయ.

పారి—ఓహో! తెలిసినది. విద్వత్పరీక్షయం దుత్తీర్ణుఁడై ప్రభుత్వమువారిచే "విద్వాన్" అను బిరుద మొసఁగఁబడినయాతఁడేనా? అయినచో ముఖ్యముగా నీనాటకము ప్రయోగింపఁదగినదే.

సూత్ర—సామాజికులు వేఁచియున్నారు. ప్రస్తుత మీ వసంత ఋతువునుగూర్చి యించుక వర్ణింపుము. వేగమపోయి పాత్రముల నాయత్త మొనర్తుము.

పారి—

లయగ్రాహి.

కోకిలలు మావిచిగు ♦ రాకులను మెక్కియల
వోకొకఁడొకండు వెసఁ ♦ బైకొనుచునుండన్
మూఁకలుగఁ జేరిపలు ♦ పోకలుగఁ గీరతతు
లాకసము వెంటనెగఁ ♦ బ్రాఁకుచు ధ్వనింపన్

నాక జలజాకరము • శీకరములెత్తి పొలి • బోక
మలయానిలుఁడు • పైకెగరఁజల్లఁగా
శ్రీకర వసంత కుసు • మాకరములోకహిత
మైకనుఁగొనఁగా గనుల • కేకసుఖమిచ్చుఁగా.

మఱియును—

తే॥ రమ్యసహకార లాభ సం • ప్రాప్తిఁగోరి
వననివాసంబుఁ బూని స • ద్వ్రతమునల్లు
నాగ నలరెడి మృదు కాంచ • నములతోడ
షట్పదామోదకరమగుఁ • జైత్రలక్ష్మి.

సూత్ర—అవు నట్లేయున్నది కాని కాలస్వభావము దెలియ శక్యము కాదుగదా? ఒకచో దులలేని వేడుకల నొందువారును మఱి యొకచో ననల్పచింతా సాగరనిమగ్నులునుగదా యెల్లపుడును.

పారి—నిజమే లోకమంతయు నొక్కరీతిగ నుండునా? కొందఱు సంతానార్థులై తపించుచుండఁ గొందఱు సంతానాభివృద్ధి విఘ్న కారులగుఁ బ్రతిబంధకములఁ దొలఁగింపఁ గుందుచుందురు.

సూత్ర—ఓహో! ఇఁక నాలసింపరాదు. చిత్రవర్మమహారాజు పాత్ర మును నేనే ధరింపవలసియున్నది. సామాజికులు వేచియున్నారు.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---



శ్రీ మీనాక్ష్యైనమః.

# సీమంతినీ నాటకము.



## ప్రథమాంకము.

(రంగము. అంతఃపురము. ఇందుకళ, చిత్రవర్మ, మధురిక ప్రవేశింతురు)

ఇందు—మనోహరా! అనేక సంవత్సరములు రాజ్యమంతయు మంత్రుల కొప్పించి మహారణ్యములందు మునులతోఁ బాటుగఁ బెక్కు కష్టములఁబడి భక్తరక్షణ పరాయణురాలగు మీనాక్షీదేవి యనుగ్రహమునఁ బుత్రుని గాకున్నను బదునాలుగు తరములఁ దరింపఁ జేయఁగల పుత్రికారత్నమును బడసినందులకు మనమెంతయు నదృష్టవంతులమే. ఆహా! ఆదేవినేమని పొగడఁగలము.

చ॥ నిరతము భక్తితోఁ దనను ♦ నిష్ఠమెయిన్ భజియించు వారిపైఁ
గరుణ వహించి దేవతలు ♦ గాఁతురటంచు శ్రుతుల్ వచించు వా
క్సరణి యసత్యమౌనె చిర ♦ కాలముఁ బుత్రీ ముఖావలోకన
త్వరను దపింపఁగా మనకుఁ ♦ బట్టి నొసంగదె యాదిశక్తియున్.

చిత్ర—(స్వగతము) ఇంకను నా ప్రాణేశ్వరి తన కూతునకు రాబోవు దుస్థితి నెఱుగదు కాబోలు. ఆహా! ఎంతలో నెంతయశుభవార్త వినవలసెను. ఇట్టి మహాసంతోషముతోఁ దననే యదృష్టవంతురాలఁగఁదలంచు నా దేవికీ కఠినవార్త నేమని వినిపింపఁగలను. (ప్రకాశము) దేవీ!

చ॥ సతత నృపాలమౌళి విల ♦ సన్మకుటాగ్రమణీమయూఖరం
జితచరణాబ్జునైన నస ♦ దృగ్విభవాహత సర్వదేవతా
పతియగు వానినైనఁ దన ♦ ప్రౌఢిచెలంగఁ గృశింపఁజేసి దు
ర్గతిఁబడఁద్రోయుఁగాదె యుడు ♦ రాజనిభాస్యవిచారముగ్రమై.

పురాకృత కలుషపరిపాక జనితదుఃఖ పరంపరలోనికెల్ల దుర్భరమై దురంతమై దుర్విచారమై విచార దుఃఖము ప్రతివానిని బాధించునుగదా.

ఇందు—(స్వగతము) ఇదేమి? ఇట్టి సంతోషసమయమున నా మనోహరుఁడు తలంపరాని విచారమును గూర్చి చెప్పుచున్నాఁడు. (ప్రకాశముగా) నాథా! సంసార మసారమనితలఁచి మహారణ్యములఁ బవన పర్ణాంబు భక్షణంబునఁగృశించి దుస్సంగపరిత్యాగముఁగావించిన మహర్షులకేని యొకవిధమగు విచారముండఁ బుట్టినది మొదలు జచ్చువఱకును ధనలోభులై యధర్మం బాచరించుచు నసత్యమునకు వెఱపుఁజెందని పామరులకు విచారముండు టబ్బురమా? అట్టి విచారము బాధింపకుండునా? అయినను దత్కాలశాంతిఁ గావించి సంసారరథము నడపుట లోకాచారమై యున్నది. ఇది యందఱనొసఁటను వ్రాయఁబడి యుండుటవలనఁ బ్రతివాఁడును జింతింపఁడు.

చిత్ర—దేవీ! నీ లోకానుభవమునకుఁ జాల శ్లాఘింపలయును.

సీ॥ సతత విభూతి భూ ♦ షితుఁడైనను శివుండు
గట్ట వస్త్రములేక ♦ కష్టపడఁడె
యనయంబు లక్ష్మీశ స ♦ మాశ్లిష్ట భుజుఁడైన
హరి యుంటకిల్లు లే ♦ కబ్ధిఁజొరఁడె
కడుపు బంగారు బొ ♦ క్కసమెయైననుగాని
పరమేష్ఠి పక్షిపై ♦ తిరుగకున్నె

తన ప్రభుత్వము దేవ ♦ తలయందయి పులోమ
జాపతి పడిపంచ ♦ కాఁపుగాఁడె
తే॥ తక్కఁగల దిక్పతులతోడ ♦ లెక్కయేమి
లోకనాయకులే యిట్టి ♦ లోపమునకుఁ
బాత్రులై చింతిలుచునుండఁ ♦ బ్రాకృతులకుఁ
జింతకలదను పలుకేమి ♦ వింతయగును.

కాని యిట్టి విచారసాగర మీఁదుట కష్టముసుమా?

ఇందు—అట్లని యెవరు తప్పించుకొనఁగలరు?

చిత్ర—నీవు చెప్పినట్లు దానికిఁ బరిహారము కలదు. ఏమందువా? శాస్త్ర విహితంబులగు జప హోమ సురార్చనాదులచేత నించుకంత శాంతియగునని పెద్దలు చెప్పుదురు.

ఇందు—నాథా!

తే॥ సత్కథాలాపములచేత ♦ సమయమెల్ల
నిమిషముగఁ గడపెడు భూమి ♦ నేతవీవు
శ్రవణ కఠినంబయిన విచా ♦ రంబుఁ గూర్చి
ముచ్చటింపఁగ హేతువే ♦ మో యెఱుంగ.

ఎన్నియో నోములునోఁచియుఁ జిరకాలము సంతానము గలుగకున్నప్పుడు గూడ మీరిట్టి దైన్యముగ మాట్లాడలేదే. జీవితేశ్వరా! నేఁడిట్లు మాట్లాడఁ గారణమేమి? ఎట్టి విచారమైనను నల్లారుముద్దుగ నాడుకొనుచు మనకెంతో సంతోషముఁ గూర్చు సీమంతినిని జూచినంతనే నిశ్శేషమై పోవునుగదా?

చిత్ర—ఆ సీమంతినినిగూర్చియే నాకింతటి విచారము సంభవించెను. సంతానము గలుగకున్నఁ గలుగలేదనుచింతయేతప్ప నింతటి విచారముండదు.

ఇందు—నాథా! అదేమి? అట్లుబల్కుచుండిరి? మనయమ్మాయిని గూర్చి విచారమా? అయ్యో! దైవమా!

చిత్ర—

ఉ॥ చెప్పినఁదీరునే విషముఁ ♦ జేర్చియొనర్చిన సూఁదిబోలె నొ
క్కప్పుడు నాదుచిత్తమున ♦ గాటముగా దిగి బాధసేయు నొ
క్కప్పుడు కంఠనాళములఁ ♦ గత్తివలెన్ దెగఖండఁగోయుఁ బా
నప్పటికప్పుడే యుదయ ♦ మై పయికిన్ గనరాక యక్కటా.

మ॥ అరిగాఁపుల్ బహుమానపూర్వకముగా ♦ నశ్వంబులన్ స్యందనో
త్కరముల్ మత్తగజంబులన్ సుభట సం ♦ తానంబు నర్పించినన్
సరిగా వారల నాదరించుటకు ను ♦ త్సాహంబు లేదయ్యెనో
తరుణీ! ఘోరవిచార దుస్తర సము ♦ ద్రప్రాప్తిచే నెమ్మదిన్.

తలంపరాని యీ విచారముచేత నాశరీరము నశించుననుమాట నిక్కము. గురుపత్ని యుపదేశమువలనఁ బుత్రుఁడైనను బుత్రికయైనను బరమేశ్వరి యనుగ్రహముచేతఁ గలిగెగదా యని సంతోషించుచుంటిని. కాని నాజన్మమెల్ల నిట్లు దుఃఖభాజనమగునని తలంపనైతిని.

చ॥ పరుగిడుచున్న యశ్వమును ♦ బగ్గముఁగైకొని లాఁగునట్లు దు
ర్భరమగు నీవిచారమునఁ ♦ బారెడిచిత్తము బిగ్గఁబట్టి యే
కరణిమరల్పఁజూచినను ♦ గాని యహో చనుచుండు నింకనే
సరణిఁ దరింపనేర్తును వి ♦ చార సముద్రమునుండి యక్కటా.

శుక్లపక్షపుఁ జంద్రికవలె దినదినాభివృద్ధియై పదునాలుగు సంవత్సరములకే సకలశాస్త్ర పారంగతురాలగుఁ గోమలాంగికా యిట్టి దుస్థితిఁ గలిగింపనెంచితివి! తల్లీ! పరమేశ్వరీ! విషవృక్షమునైనను దాఁనుఁ బెంచినదాని నెట్టికఠినుఁడును నరుకసాహసింపఁడే? మధురములగు ఫలముల నొసఁగఁగల రసాలవృక్షమును గారవమునఁ బెనిచియు సమూలముగ ఖండింప సమకట్టుటొప్పునా? హా! కుమారీ! (మూర్ఛిల్లును)

ఇందు—(భయముతో) అయ్యో! దురదృష్టమా! మాయందిట్లు ఫలించితివేమి? మధురికా! ఇదేటి గ్రహచారమే నానాథుఁ డిట్లనుచున్నాఁడు.

మధు—(దీనయై) అమ్మా! ఏమని చెప్పగలను. నోరాడుటలేదు. నిన్నటి ప్రాతఃకాలమున మహారాజుగారు మంత్రులును పురోహితులును జమూపతులును బండితులును బలసి కొలువ సంతోషమునఁ గొలువుదీర్చియుండిరి. అట్టి సమయమున నెక్కడనుండియో యొకదైవజ్ఞుఁడు వచ్చి యేలినవారింగాంచి తాఁజదివిన శాస్త్రములన్నియుఁ బేరుపేరు వరుసను జెప్పి జ్యోతిషమందుఁగూడఁ దనకు నిరంకుశమైన సామర్థ్యము గలదని పలికెను. అప్పుడు రాజుగారి యనుమతిచే మహామంత్రిగారు సీమంతినీదేవి జాతకము నాపండితునియెదుట బెట్టిరి. అంత నాతఁడా జాతకమును గొంచెముసేపుచూచి యీజాతకురాలికి లోకోత్తరుఁడగు జక్రవర్తికుమారుఁడు పతియగుననియు, నరుంధతి సావిత్రి మున్నగు మహాపతివ్రతలపాతివ్రత్యమునకు వన్నెఁబెట్టఁగల పతిభక్తి గలుగుననియుఁ జెప్పి యింకఁ జెప్పఁగూడదని యూరకుండెను. అందునకు మహారాజుగారనుమానముచే బలవంతముఁజేయ నాదైవజ్ఞుఁడు సీమంతినీదేవికి వివాహమైన యీాలు నెలలో వైధవ్యము సంభవించునని చెప్పి వెడలిపోయెను. దానికై మహారాజుగారు చింతించుచున్నారు.

ఇందు—హాపరమేశ్వరా! (క్రిందపడును.)

మధు—అమ్మా! ఊరడిల్లుము. దైవసంకల్పమున కెవరేమిచేయగలరు.

ఇందు—(మెల్లనలేచి) ఎట్టి సంతోషమెట్లు దుఃఖముగామారెను. బంగారుబొమ్మవలె నెల్ల వారికిని సంతోషము గల్గించు నాకూతునకే యిట్టి దుఃఖము సంభవించునా? కలనైన నితరుల కప

కారమొనర్చి మెఱుఁగదే. పగవారినైనను బల్లెత్తి కోపించు నదికాదే! తల్లీ! మీనాక్షీ! ఎంతయో కష్టపడి నీసేవఁజేసినందు లకు మా కనాధయగుఁ బుత్రికనే యొసంగితివా? సకలలోక జననివగు నీవు మాయందింత కాఠిన్యమునే వహింతువా?

చిత్ర—తరుణీ! ఎట్టిమహాపాతకము గావించిపుట్టితినో యీవార్తాక మున నింతటిమనోవ్యథగలిగెను. బ్రహ్మాదులకేని విధినిదాట వశమా? తడవుకాలము పుత్రముఖదర్శనలాభమునకై పెక్కు కష్టములఁబడి యీశ్వరానుగ్రహమునఁ బుత్రుని మారుగఁ బుత్రికనైనఁ గాంచఁగలిగితినిగదాయని సంతోషించితిని కాని యింతలోనింత దురంతరమైన చింతకలుగునని యెంచితినే? ఈమనోవ్యథయే నాకుమృత్యువుగఁ బరిణమించునేమో?

ఇందు—నాధా! సర్వమెఱిఁగిన మీరే యిట్లు జింతిల్లమావంటి యజ్ఞానులగతి యేమగును? తెలిసితెలియని యావృద్ధుడేదియో పలికినందులకింత వంతజెందఁదగునా? ధైర్యమువహింపుఁడు.

చిత్ర—ఇంకేటిధైర్యము. ఏటిబ్రతుకు. పురాతనమునుండియుఁ బితృ పితామహులచేఁ బాలింపబడిన యీరాజ్యమెల్ల నేటితోఁ బరరాజుల పాలగునుగదా! మనకు రాబోవుదుర్గతి నెఱింగి శత్రువులు మనపైనిప్పుడే దండెత్తి రాకుందురా?

ఇందు—దైవసంకల్పమున కెవరేమిచేయఁగలరు? (మధురికనుజూచి) మధురికా! ఈకఠినవార్త నమ్మాయికి వినిపించి యిప్పుడే దుఃఖసముద్రమున ముంచకుము. దానిపాపమునకు మేమేమి చేయఁగలము.

మధు—అమ్మా! ఈయమంగళ వాక్యమప్పుడే యామెకుఁదెలిసినది.

ఇందు—హా తల్లీ! దేవతావరమునఁ బుట్టిననీవు మముద్ధరింతువని సంతోషపడితిమే? ఎంతగతి గల్గెనే సీమంతినీ!

[ తరువాత సీమంతిని ప్రవేశించి తనలో ]

పరమేశ్వరా! నాజన్మమెంత దుఃఖభాజనమయ్యెను. ఎట్టి సహింపరాని కష్టములకైన నోర్వవచ్చును గాని దుర్భరమగు వైధవ్యదుఃఖము సహింపవచ్చునే? నన్నిట్టి హీనదశ ననుభవించుటకే మహారాజుకడుపునఁ బుట్టించితివా? నేనేమహాపాతకముఁ గావించితిని? (నిట్టూర్పువిడచి) ఆవృద్ధపండితుఁడు పిడుగువంటి వార్తఁజెప్పి నాసంతోషమంతయు నేలపాలుజేసెను. ఆతఁడేమైనఁ బ్రమాదమునఁ బలికియుండునా! (ఆలోచించి) ఈ నిర్భాగ్యురాలికంతటి యదృష్టమా? నాజాతకము దుష్టగ్రహసంకుల మగుటచేత నట్టియమంగళము గలుగఁ గలదని యాతఁడాలోచించియే చెప్పియుండును. ఇందసత్యములేదు. ఇంకనాకు గతియేమి? ఈ భూభారమగు నా జన్మమువలనఁ బ్రయోజనమేమి: తలిదండ్రుల యనుమతిఁబడసి నాతెను త్యాగమునకై యేదేని యుపాయ మాలోచించెదను. (చూచి) ఆహా! నాకు రానున్న మహాపదకై చింతించి చింతించి ప్రాణములఁగూడ విడచునంతటి దుస్థితిలోనున్న నాతలిదండ్రుల నెట్లోదార్పఁగలను. (సమీపించి) తలిదండ్రులారా! నమస్కారము.

చిత్ర—అమ్మా! చిరంజీవినివి గమ్మా.

ఇందు—తల్లీ! ఆమాలదైవము నీకెట్టివ్రాఁతవ్రాసెను. (దుఃఖించును)

సీమం—(స్వగతము)వీరికిప్పట్లనాశక్తికొలఁది ధైర్యముఁజెప్పవలయును. లేదేని నాకొఱకై నిష్కారణముగాఁ గృశింతురు. (ప్రకాశము) తలిదండ్రులారా! మీరునాకై యెందులకుఁ జింతిల్లెదరు. విధిలిఖిత మనుభవింపక తప్పునా! శాంతింపుఁడు. నాచేసినపాపమిట్లు ఫలింపనుండెను.

చిత్ర—అమ్మా! మాకింకనెట్లు మనశ్శాంతి కలుగును? ఎంతధైర్యముతో నుందుమన్నను నాచిత్తము చలించుచునే యున్నది. యుద్ధరంగముల భయభ్రాంతులై పరుగెత్తు శత్రుసైన్యముల క్షణములో నిలుపఁగలిగిన నాకిప్పట్లు నామనస్సునే చలింపనీయకుండుటకు సామర్థ్యము లేదయ్యె.

సీమం—తండ్రీ! మీకువిచారమేల? నేనే త్రిలోకజననియగు మీనాక్షీదేవి యనుగ్రహమునఁ బుట్టినదాననగుదునేని నామాంగల్యమునకేలోపమును గలుగనేరదు. అట్టియాదిశక్తి తనను సేవించు మీకు ముల్లోకములనేనిఁ బరిపాలింపఁగలఁ బుత్రునిడకున్నను వైధవ్యదుఃఖముచేఁ బరితపించు కూతునొసఁగునా? ఇది యంతయు నసత్యము. వార్ధక్యముచేత మదిచెడిన యొకవిప్రుండు చెప్పినమాటయా! మీరువిశ్వసింతురు.

[ తెరలో ]

మ॥ అరయన్ రూప విహీనుఁడయ్యు నల్బ్రబ ♦ హ్మాజ్ఞానులామానిశే
ఖరు లెవ్వానిఁగనన్ దలంతురచటన్ ♦ గన్పట్టుచుండున్ జరా
చరలోకంబున కెల్లకర్తయయి యే ♦ సంబంధమున్ లేని యీ
శ్వరుఁడేవాఁడు నిరంజనుండతని సం ♦ భావింతు ధన్యాత్మతన్.

(అని చదువుచు యాజ్ఞ్యవల్క్య ప్రవేశించును.)

చిత్ర—మునివర్యా! నమస్కారము. ఈ యాసనము నలంకరింపుఁడు.

యాజ్ఞ్య—మహారాజా! నీకు సంతోషము గలుగుఁగాక.

(అందరును నమస్కరింతురు.)

చిత్ర—(విచారముతో) గురువర్యా! నాయవస్థనేమని విన్నవింపఁగలను.

యాజ్ఞ్య—అరుణాస్పదపురీశా! మీ వృత్తాంతమంతయు దివ్యదృష్టి నెఱిఁగితిని. చింతింపకుము. విధినిదాఁట నెవరితరము. పరమేశ్వరుఁడగు శ్రీ మహావిష్ణు వంతటివాఁడు తనచేసిన పాపమున నానా యోనులందు జన్మించెను. మనుష్యులమాట యెందులకు?

చిత్ర—అట్లని భరింపరాని దుఃఖములకు సహింపఁ గలమా ? మీ శిష్య జనము ననుగ్రహించి యేదేని యుపాయమున రక్షింపుఁడు. పరమ పతివ్రతాతిలకమగు మైత్రేయిని కరుణవలన సంతానము లేకపోయెఁ గదాయను విచారము తొలఁగి నేటికీపసిబిడ్డ నిర్భా గ్యుఁడనగు నా కడుపున శేలఁబుట్టెనా యను విచారము ప్రబల మయ్యెను.

యాజ్ఞ్య—భూనాయకా! నీ దురదృష్టమునకు నేనేమి చేయఁగలను.

చ॥ తన తొలిజేసినట్టి సుకృ ♦ తంబును దుష్కృతముర్ ఫలించి యీ
జననమునన్ మనుష్యునకు ♦ సౌఖ్యమొ దుఃఖమొ గూర్పుదానికై
మనసుఁ దపింపఁజేసి పర ♦ మంబగు స్థైర్యములేక చింతలన్
మునిఁగినచోఁ బ్రయోజనము ♦ బొందఁగ నేర్చునె యెట్టియాతఁడున్

కావునఁ దల వ్రాఁత ననుభవింపవలసినదే ? యని తలఁచి చింతిం పకుము. మేరు ధీరుఁడవగు నీవే యిట్లధైర్యముఁజెంద నబలలగు నీ కాంతా పుత్రికలగతి యేమగును ?

సీమం—(స్వగతము) అయ్యో! ఈ మహర్షిశేఖరుఁడు నాకేదేనిమార్గ ముఁజూపి రక్షించునని తలఁచితినే! నా యాశాలతను సమూ లముగాఁ బెఱికివేయు చున్నాఁడేమి? (ప్రకాశము) మహాత్మా! సర్వసమర్థులగు మీరే యిట్లుబలుక నే నెవరి నాశ్రయించు దానను. నాజీవయాత్ర యెట్లు గడువఁగలదు. నన్నురక్షింపుఁడు.

యాజ్ఞ్య—సీమంతినీ! నకేభ్రాంతియేల? నీ వెఱుఁగని దేదికలదు.

తే॥ తెలిసియో తెలియకయొ దు ♦ ష్కృత మొనర్చి
దానిఫలము భుజింపనా ♦ తతినిఁ గష్ట
మనుచుఁ జించించినను లాభ ♦ మగునె చూడ
కర్మిఁద్రొక్కినఁ గాలదే ♦ యంఘ్రియుగము.

సీమం—తండ్రీ! నన్ను మన్నింపుఁడు. సంతానహీనులగు మా తలిదండ్రులకు మీయర్థాంగలక్ష్మి మైత్రేయి సదుపదేశమున సంతాన ప్రాప్తి గలిగించి యపుత్రకులమను విచారమును దొలఁగించినది. తపః ప్రభావమున బ్రహ్మాదులనేని విపర్యాసము గావింపఁగల మీరు నా కాయుష్మంతుఁడగు భర్తను గూర్చి నావిచారముఁ దొలఁగింపుఁడు. లేదేని గురుపత్ని మావంశమునకు దుఃఖముఁ గల్గించిన దగును. నా దురదృష్టవశమున నిందులకు మీరు కరుణింపలేని చిరకాలము జీవింపఁగోరుఁ జక్రవర్తి కుమారుని జెట్టఁ బట్టి యల్పాయుష్కునిగఁ జేసి భరింపరాని వైధవ్యదుఃఖము ననుభవింపవలసి వచ్చును. కావున నేను నిరంతర బ్రహ్మచర్య మవలంబించి మీయాశ్రమమునందేమీకు శుశ్రూషసలుపుచుఁ గాలముఁగడపునట్లు లంగీకరింపుఁడు. కాదేని పవిత్రములగు మీ పాదములకు నా ప్రాణవాయువుల నొసఁగి శరీరముఁ ద్యజింతును.

(పదములపై బడును)

యాజ్ఞ్య—(స్వగతము) ఆహా! ఇప్పుడేమి చేయువలయును? విధివ్రాఁతను సవరింపఁగలనా? కానిమ్ము:-(ప్రకాశముగా) సుమంగలీ! నిన్ను బరమేశ్వరుఁడు రక్షింపఁ గలఁడు లెమ్ము.

సీమ—(మెల్లనలేచి) ఆహా! ఏమి నా యదృష్టము. ఈ మునీంద్రుని వాక్య మమోఘముగదా?

యాజ్ఞ్య—సీమంతినీ! నీవు వైధవ్య మనుభవించునట్లు పరమేష్ఠివ్రాసిన వ్రాఁతను దిద్దవలసిన భారము మాయందుండెను. కావున నా వాక్యములు నిశ్చలచిత్తవై వినుము. సమస్త వేదవేదాంగ విహితమై సకలకులజుల కాచరణీయమై ప్రసిద్ధమగు నొకవ్రతము నుపదేశింతును. దాని నాచరింతువేని నీకుఁ జిరంజీవియగు బతి లభింపఁగలఁడు. వినుము.

క॥ వ్రతములలోపల నుత్తమ
వ్రతమనఁగ సోమవాస ♦ ర వ్రతమది సం
సంతత మొనరించిన సతులకు
గతియగు నైదువతనంబు ♦ గల్గునుగాదే.

చిత్ర—గురూత్తమా! మీ యనుగ్రహముకతన ధన్యుఁడనైతిని. పాప వినాశకమగు సోమవారవ్రతము నాచరించు మార్గము నెఱిం గించి నన్ను మన్నింపుఁడు.

యాజ్ఞ్య—సీమంతినీ! ఆలకింపుము. బ్రహ్మాదులకేని నిర్విఘ్నముగా నావ్రతమాచరింప శక్యముగాదు. దాని విషయమై నీ వెట్లు జాగ్రతగా మెలంగెదవో. మహీపాలా! నీవును వినుము.

చ॥ క్రతువు లొనర్పవచ్చుఁ జిర ♦ కాలము నిశ్చలభక్తితో నుమా
పతిని భటుండుగాఁ గొనఁగ ♦ వచ్చుఁ బదంపడి సర్వలోక సం
స్థితి నొనరింపవచ్చు బుధ ♦ సేవితమై తగు సోమవాసర
వ్రత మొనరింపవచ్చునె యె ♦ వారికినైనను భంగమొందకే.

ప్రతి సోమవారముననను యమునానది కరిగి యందుస్నానమాచ రించి యటనుండి తెచ్చిన నిర్మలోదకమున సోమశేఖరు నభి షేక మొనర్చి సక్రమముగా నుమామహేశ్వరుల నారాధించి వివిధ దేశములనుండి వచ్చిన బ్రాహ్మణ దంపతులఁ బార్వతీ పరమేశ్వరులుగ భావించి పూజ సేయుచుండుము. ఇందేదిలోప మైనను వ్రతభంగమేసుమీ? త్రిమూర్తులు వచ్చి పరీక్షించి నను నీవ్రతమునకు విఘ్నమురానీయకుము. దీనికిఁ దప్పితివేని నీవేగాక నేనుగూడ నధోగతిఁ బడవలసివచ్చును. వినుపుగదా పురాణములందు.

సీ॥ అడిగినయేని యే ♦ యిడుమలు గల్గినఁ
గాదన కొసఁగిన ♦ ఘనుఁడొకండు

సత్యంబుకొఱకునై ♦ సకల రాజ్యంబును
ధారవోసినయట్టి ♦ ధన్యుఁ డొకఁడు
ఏకపత్నీవ్రతం ♦ బే మోక్షదంబని
యాచరించినయట్టి ♦ యనఘుఁ డొకఁడు
ధర్మరక్షణమె ప్ర ♦ ధానంబుఁగా నెంచి
వివిధ సౌఖ్యంబుల ♦ విడచె నొకఁడు

తే॥ భూతతృప్తియె తనకు సం ♦ పూర్ణముక్తి
కామినీ పరిరంభణ ♦ కాంక్షఁదీర్చు
ననుచుఁ జరియించె నొకఁడు వా ♦ రందఱరయ
వ్రత నియతిని మెలఁగిన ♦ వారె కారొ.

చ॥ తన ప్రియుఁ డస్తమించినను ♦ దారుణబాధలు గల్గినన్ మహా
జనవచనం బసత్యమను ♦ సంశయ మాత్మఁ గలంగఁ జేసినన్
దన యొనరింపఁ బూనిన వ్ర ♦ తంబును వీడక భక్తి నాచరిం
చిన నియతాత్మకుల్ గలరు ♦ చెప్పఁగ నేటికి లోకమందునన్.

ఎల్లి సోమవారమున నా వ్రతము నాచరింపుము. మే మిటకు వచ్చి చాల తడవైనది. పోయివచ్చెదను. (నిష్క్రమించును)

[అందరును నిష్క్రమింతురు.]

(రంగము పూజామంటపము సీమంతిని దంపతిపూజలఁ జేయుచుండును చిత్రవర్మయు నిందుకళయుఁ జూచుచుందురు.)

(తెఱలో) ఓరీ! రాజాధమా! ఏమిరా నీకండకావరము. లోకమునందున్న వారికెల్ల శుభలేఖలనంపి నన్ను బిలువకున్నను దయఁదలఁచి వచ్చెఁగదా యని గౌరవింపక చూచిచూడనట్లున్నావు.

మ॥ అర రే దుష్టుఁడ! క్రూరకర్ముఁడ ఖలుం ♦ డా! నీచుఁడా! కండకా
కావరముల్ బూని శరీరముల్ మఱచి యా♦హ్వానంబు లేకుండినన్

సరగున వచ్చిన నాదరింపక తి ♦ స్కారంబుఁ గావించితే
దురితాత్మా! ఇదె చూడు నీవ్రత మబం ♦ ధు ప్రీతిఁగావించెదన్.

దిగంత విశ్రాంత యశోవిశాలుఁడగు నీమైత్రేయుఁడు నీకంటికిఁ దృణముగాఁ గనఁబడెనా?

చిత్ర—(వినుట నభినయించి ఇదేమీ? ఈక్రోధ పూరితవాక్యము లెక్కడివి? (ముందునకు నడచును.)

సేవకుఁడు—(ప్రవేశించి) మహారాజా! జయము జయము. ఎవరో యొక బ్రాహ్మణుఁడు ద్వారము కడ నిలచి తమపై నాగ్రహమున నఱచుచున్నాఁడు.

చిత్ర—(భయముతో) ఆ. బ్రాహ్మణుఁడా? ఎంత ప్రమాదము. పోవుదము రమ్ము (ఇరువురు నిష్క్రమింతురు)

(రంగము-ద్వారము-మైత్రేయుఁడు చిత్రవర్మ ప్రవేశింతురు.)

చిత్ర—(వినయముతో) మునివర్యా! నమస్కారము. వ్రత పరామరికచే మిమ్ముఁ గాంచలేనైతిని. నాయపరాధము క్షమింపుఁడు. (పదములఁ బడఁబోవును.)

మైత్రే—(తొలగి)ఓరీరాజాధమా! నీ నక్క వినయములు నాప్రోలనా సాగింతువు? నాకెఱిఁగింపక వ్రతారంభముఁ గావించియు దయ దలఁచి చూచి పోవుదును గదా యని వచ్చిన నన్నవమానించి మీఁదు మిక్కిలి మన్నింపుమని పలికెదవుగా? ఛీ తొలఁగుము. క్షణకాల మాహారమునకు వేళమించినఁ దల్లక్రిందుగఁ బడు మీరా వ్రతాచరణ సమర్థులు?

తే॥ అనయ ముపవాస జీర్ణాంగు ♦ లగుచు నెల్ల
సౌఖ్యములఁ బారఁదోలి యె ♦ సంగునట్టి
వారి కొనరింపఁదగు సోమ ♦ వాసరంబు
వ్రతమదేల? నబలలగు ♦ వనితలేల?

నీమొగము జూడరాదు పొమ్ము (పోవుచున్నాఁడు)

చిత్ర—(స్వగతము) పరమేశ్వరా! ఎట్టి సంకటము గల్గించితివి. [ప్రకాశము] మునిచంద్రమా! నాపై మీకు నిష్కారణముగ నాగ్రహమేల? క్షమింపుఁడని వేడుకొంటిని గదా దయ చేయుఁడు.

మైత్రే—ఓరీ! అనర్హులగు మీకీ వ్రతరాజము నుపదేశించిన గర్భదరిద్రుఁడెవఁడు?

శా॥ ఛీ! యీలాగునఁ బల్క నీకు మదిలో ♦ సిగ్గేల లేదయ్యె నౌ
రా యెందేని యనిత్యమౌఁ తనువుపై ♦ భ్రాంతిన్ విడన్ లేక యు
క్తాయుక్తంబు లెఱుంగనేరువని క ♦ న్యల్ స్థైర్యముల్ బూని యెం
తో యాయాస కరంబులౌ వ్రతములం ♦ దున్ నిల్వఁగా నేర్తురే?

అభాగ్య దేవతయగు నీకూతునకా వ్రతాచరణ సామర్థ్యము? నీయవిధేయతఁ గన్న నాకుఁ గ్రోధానల ముద్భవించుచున్నది.

చిత్ర—మునివర్యా!

తే॥ తప్పు గలిగిన దండింపఁ ♦ దగును గాని
యూరకయె కోపము వహించు ♦ టుచితమగునె
కటికిపాపైనఁ గాని త్రో ♦ క్కకయె పడగ
నెత్తి కఱువఁగఁ దలఁచునే ♦ యెన్నఁడైన.

నాతప్పుల మన్నింపుఁడు.

మైత్రే—ఆయుద్దేశ్యము మాదిగాదు. ముఖ్యముగా మేము శాసన కర్తల మని యెఱుఁగుము. (నిష్క్రమించుచున్నాఁడు.)

చిత్ర—ఎంతటి విచారము సంభవించెను. గోరుచుట్టుపై రోఁకటిపోట న్నట్లు లేక లేక కలిగిన కూతును గూర్చి పరితపించు నేనీశాపాయుధుని కోపమునకుఁ గూడ గుఱియైతిని? ఈ పరమ కోప

స్వభావుఁడగు మైత్రేయర్షి మమ్మెట్లు సాధింపఁ దలఁచునో గదా? (నిట్టూర్పు విడచి) కానిమ్ము పరమేశ్వరానుగ్రహమున్న నీగోఁచి పాతలరాయఁడేమి చేయఁగలుగును. (వెనుకజూచి) ఇదియు నొకమేలే. ముక్కోపియగు నాతాపసి వచ్చుటయును మూఁపై గినియుటయు నెవరికిఁ దెలిసినది కాదు. ఇంకమీఁదఁ గూడ నిది రహస్యముగనే యుండుగాక, (నిష్క్రమించును)

ఇది ప్రథమాంకము.





శ్రీ మీనాక్ష్యైనమః.

# సీమంతినీ నాటకము.



## ద్వితీయాంకము.

(రంగము తపోవనప్రాంతము. మైత్రేయర్షి ప్రవేశించి పశ్చాత్తాపమున)

ఆహా! నిష్కారణముగ ప్రమాదము నొంది నే నెట్టి యకార్యముం గావించితిని. పిలువని పేరంటమునకు నేను బోవనేల? పోయిన వాఁడను వారు మర్యాదఁ గావించినను లేకున్నను చూరవఁ జేసికొని లోనికిఁ బ్రవేశించుటయో వెనుకకు మరలి వచ్చుటయో తగును గాని దేవుఁడొసఁగిన కోపము కలదుగదా యని యొడలు మఱచి యాగ్రహముఁ జెందనేల? యుక్తాయుక్తము లెఱుఁగక సీమంతిని యాచరించు వ్రతము భంగము గావింతునని పలికితినే కాని యాసాధ్విని సాధింపఁగలనా?

తే॥ సతుల భావంబుఁ జేపల ♦ గతియు నొసటి
వ్రాఁతఫలమును గాలంబు ♦ పరిమితియును
బండితచమత్కృతియు మహా ♦ వ్రత నియతియు
నెఱుఁగ నెవ్వారికైనను ♦ దరమె జగతి.

(విమర్శించి) గగనారవిందమునైన సృజించునేర్పుగల నాకా యబలను సాధించుటొకలెక్కయా? కష్ట నిష్ఠురములకోర్చి

కాయము శుష్కింపఁ గఠినాటవులవసించి సంసారేచ్ఛలేక తపంబొనర్చు మావంటి మునులకేని సాధింపరాని సోమవార వ్రతమును నిరంతరసుఖలాలసయై నిశ్చలతయున్న నెఱుఁగక ధనమదావేశంబున సంచరించు నొకరాకన్నియయా యాచరించును? బాగు! బాగు! ఇంతమాత్రమునకే నాకువిచారమేల? పాపముగాని పుణ్యముగాని ప్రారంభించిన కార్యమును త్యజింపరాదు. కాన నేనెట్లైన నామెవ్రతము భంగముజేయవలసినదే.

చ॥ ఎదిరి బలాబలంబెఱుఁగ • కెవ్వఁడు చూచెడివాఁడు మొత్తురం
చదసని కన్నుగానక స•హాయబలంబె ప్రధానమంచు లో
నఁ దలఁచి మమ్ముఁబోంటిముని•నాథులతోఁ గలహంబుఁ బెంచువాఁ
డెద బరితాపమందు నటు • లేమరకే బరిమార్చు టొప్పదే.

వృథాయీకంఠశోష యెందులకు, ఇంకముందుఁ జేయఁగలపని నాలోచించుకొనవలయుఁగాని, చిన్నపామునైనను బెద్దకఱ్ఱతోఁ గొట్టుట మంచిదికదా? అందువలన నీకార్యానుకూలమునకై యొకమంచి యుపాయమాలోచింపవలయును. (ఆలోచనమభినయించి) అవును సీమంతినికి లోకోత్తరుఁడగు రాజకుమారునిఁ గూర్చితినా వానితోఁగలసి స్వర్ణహర్మ్యముల మదనక్రీడాలోలయై శతవిధములఁ దనవ్రతమును మఱువఁగలదు. ఇదే మంచియుపాయము. కాని సీమంతిని సౌందర్యమునకును రసజ్ఞత్వాది గుణములకును దగినవాఁడెవఁడు? (స్మృతినభినయించి) కలఁడుకదా నలమహీపాలుని పౌత్రుఁడును నింద్రసేనుని బుత్రుఁడునునగుఁ జంద్రాంగద మహారాజు. అతఁడు నూతనముగా బట్టాభిషిక్తుఁడై సకలకలాకుశలుఁడై యున్నవాఁడు. కామశాస్త్రమందుఁగూడ విశేషముగఁ బ్రవేశము కలవాఁడనియే విందును. ఆతనికి నాయుపాయచాతుర్యమున జగన్మోహినియగు సీమంతినిని

గాన్వింతునేని యామచక్కఁదనమున కక్కజఁపడి మెల్లైన నామెను వివాహమాడఁగలఁడు. చంద్రాంగద మహారాజు యుద్ధయాత్రకై ప్రయత్నము జేయుచున్నట్లు నైషధపురమునుండి వచ్చినసార్థవాహులవలన వింటినని సుమేధసుఁడిప్పుడే చెప్పి పోయెను. అతని దిగ్జయప్రస్థానము నావ్యూహమునకు విరోధించునేమో? కావున ముందుగాఁబోయి చంద్రాంగదుని యుద్ధప్రయాణము నాపి నా తంత్రమువలన నాతనికిమృగయాప్రయాణము గల్పించెదను. యమునాపరిసరోద్యాన వనమున విహరించు సీమంతిని యాతనికగుపడునట్లుజేయ సుమేధసుని నియమించి నేనాతని చిత్తరువును జిత్రవర్మఁకనిపెదగాక. అంతటితో నా శపథము నెరవేరఁగలదు. (నిష్క్రమించును.)

(ఇది శుద్ధవిష్కంభము.)

[రంగము-అరణ్యము చంద్రాంగదుఁడు ప్రవేశించును.]

చంద్రా—ఈమహారణ్యమెంత భయంకరముగా నున్నది.

సీ॥ బలితంబులై యభ్ర ♦ పటమును భేదింపఁ
బెఱిగినవవియె తా ♦ పింఛతరులు

వర్షర్తువున మేఘ ♦ పటలంబువలె ధార
గా మంచుగురిసెడి ♦ కడిమిచెట్లు

అలగు గంగాప్రవా ♦ హముఁబోలెఁ బ్రవహించుఁ
గొండవాగుల దొర్లు ♦ చుండు శిలలు

ముంగులఁగాంచి ము ♦ ప్పిరిఁగొన్న భయముచేఁ
బరుఁగెత్తునవె త్రాఁచు ♦ పాముగములు

19



తే॥ ప్రబలపంచాస్యకర రుహ ♦ ప్రకరదళిత
కరి నిచయ కుంభపతిత ము ♦ క్తాఫలౌఘ
దర్శితానేక శబరప ♦ థంబులైన
కోనలవె యిందుఁదిరుగంగఁ ♦ గూడునొక్కొ.

ఈ మృగయా వ్యసనంబునకులోనై పూజ్యులగు జననీజనకుల విడచి చాల కాలమైనది. వేగమ పోయెదఁగాక. (నడచి ముందుఁ జూచి) అదేమీ! అది సింహశాబకమా? ఇప్పుడేకదా యీ యరణ్యమునంతయు గాలించి మృగముల వధించితిని? ఇదెక్కడనుండి వచ్చెను? ఆహా యెంతసునోహరముగానున్నది? పరమేశ్వరుని సృష్టిచాతుర్య మెంతయాశ్చర్యకరము?

చ॥ కదులఁగలేక భల్లుకముఁ ♦ గాంచి భయంబునఁ దల్లడిల్లు నా
పదువులయందు దుర్వ్యసన ♦ బాధితుఁడై వెనుకానలోపలన్
వెదరెడి చక్రవర్తియెడఁ ♦ జొపెసలాడెడి కాంతచస్సర్వ
బదపడి కానవచ్చు భగ ♦ వానుని చిత్రములెల్లఁజూడఁగన్.

ఏమైన నగుఁగాక! ఈ సింహపోతమును ప్రాణములతోఁ బట్టుకొనికాని నగరప్రయాణము జేయరాదు. (నిష్క్రమించెను.)

చంద్రా—(మఱలఁ బ్రవేశించి) ఇంతవఱ కెన్నఁడేని పరమేశ్వర విని ర్మిత చరాచర ప్రపంచశాసనాధికారమునకైనఁ దగినధను ర్విద్య నభ్యసించిన యీ యోధాగ్రగణ్యునకు గుఱియైన జంతువు తప్పిపోయెనే? ఆహా! ఆ సింహము గావించు చమత్కారము నేమని పొగడవలయు.

గీ॥ చేతికిన్ జిక్కినట్టులఁ ♦ జెంతనిల్చుఁ
బట్టుకొనఁబోవ నిలువక ♦ పరుగులిడును
జిక్కియున్ జిక్కనట్లుండు ♦ సింహపోత
మింతదూరముఁ గొనివచ్చె ♦ నిపుడునన్ను.



మహా మాంత్రికుల మాయలకైనఁ బట్టుపడని నన్నా జ్ఞానశూన్య మగు నొకమృగమా మోసముఁ జేయుట. కానిమ్ము. ఎంతదూరము నాకుఁ జిక్కక పాఱపోవఁగలదో చూచెదను. నిషధాధిపతులసంకల్పము చెడునా ? క్షణమేనియు నొకచో నిలువక తగిన యాహారవిహారములులేక యా మృగమును వెంటాడి పరుగెత్తుటచే నాబలమెల్లను క్షీణించినది. ఈ ప్రదేశము మును పటివలెఁ గఠినముగాక యించుక నివాసయోగ్యముగా నున్నది. ఇందొక్కింత మార్గాయాసముఁ దీర్చుకొని తరువాత సింహాగ్రహణ ప్రయత్నము జేసెదను: (కూర్చుండి) అకటా! నేనెంత వివేకము మాలినపనిఁ గావించితిని. దుష్టమృగములఁ జెండి యారణ్యకులకు సౌఖ్యము గూర్పఁదలచి మృగయాప్రయాణము గావించిన నేను మృగయుల వెంట నగరమునకుఁబోక యాజిత్తులఁ మారి సింహమువెంట నేల రావలయును ? వచ్చినవాఁడను నా కాసింగము జిక్కకున్న వెనుకకుఁబోక యింత దూరము రానేల ? రాజ్యమా నూతనము. తలిదండ్రులా వృద్ధులగుటచే రాజ్యభారమెల్ల నాయందే నిలిపిరి. మంత్రుల రాజభక్తియా సంపూర్ణముగఁ దెలియఁబడదయ్యె. ఇట్టి సందిగ్ధావస్థయందింతకాలము నాకు నైషధలక్ష్మిని విడనాడియుండఁ దగునే ? ఇంతటనైనను పోవుదమన్న బంచాస్యము చిక్కకపోయెనను విచారము బాధించుచుండెను.

సీ॥ తన యశశ్చంద్రిక ♦ ధరణినెల్లెడ నిండి
సతతంబుఁ బూర్వప ♦ క్షముననె నిలుపఁ
దనప్రతాపాగ్ని శా ♦ త్రవ పట్టణంబుల
క్షణమాత్రముననె భ ♦ స్మముగఁ జేయఁ
దనపూతమగు నభి ♦ ధానంబు వర్ణముల్
సకల పాతకముల ♦ సమయఁ జేయఁ

దనదానజలము సం ♦ తత మేళ్ళగాఁబారి
రత్నాకరములఁ బూ ♦ ర్ణములుగఁజేయఁ

తే॥ ప్రజల గారాబమునఁ దన ♦ వారి పగిది
రక్షణమొనర్చి నైషధ ♦ రాజ్యమెల్ల
నింద్రసేన మహీపాలుఁ ♦ డిడియెనాకు
దాని విడనాడి వంతలఁ ♦ దగిలి తకటా.

సకల ధర్మాధర్మజ్ఞానమున కాలవాలమై, నిఖిల వేదవేదాంగ పారాయణమున కర్హమై, దుష్టశాత్రవ కుంభి కుంభ విదళన దక్షంబై, ముక్తికాంతాసాధక వాల విపాటన చతురమై, పరమేశ్వరప్రసాదాసాదిత సకలరాజ్యలక్ష్మీసమాలింగనయోగ్యమై పవిత్రమగు నీ శరీరమునకుఁ గారణమూర్తులగుఁ దలిదండ్రుల దర్శించి యిప్పుడే యొకమాసము గడచెనుగదా? నాకై పూజ్యులగు వా రెంత వంతలఁదగిలిరో? రాజ్యమ దెట్లుల్లాను చున్నదో? వేగమపోయి జననీజనకులదర్శించెదను.(పోబోయి) సంకల్పితమృగేంద్ర గ్రహణకార్యము కొనసాగక యరిగినచో నాపూర్వుల యశస్సునకుఁ గళంకముఁ గూర్చినవాఁడనగుదును. నీల నీరద సంతాన మొక్కుపరి కుంభోదకము వర్షించినను శింశుమార చక్రము తిరుగుట మానినను నగరమున కిప్పుడే పోరాదు. కార్యదీక్ష మానరాదు. (చూచి) ఇది యొక గ్రామమునకు సంబంధించిన యారామ మట్లున్నదే? అవును. ఈ రసాలములు, నీ పుష్పవృక్షములును జూడ నల్లీతోఁచుచున్నగి. ఇందు హాయిగ మలయమారుని సేవించెదను.

క॥ ఫలభార వినమ్రములై
యలరెడు తరుసముదయము న ♦ వాంకురములచేఁ
బొలుపారు లేత తీవియ
లెలమిఁ గలుగజేయు నాదు ♦ హృదయంబునకుఁ.

(వినుట నభినయించి) ఎక్కడిది పీమనోహరములగు మాటలు. ఇందెవ్వరో సంచరించు చున్నట్లున్నదే? పరిశీలించి చూచెదను. (మెల్లగా నడచి చూచి) ఆహా ఆకన్య యెవరు? మనుష్యాంగనయా? దేవకాంతయా? ఔరా ఆ జగన్మోహిని చక్కదన మేమని చెప్పవలయును? తరుణ కిసలయ కోమలములగు మృదు చరణములచే గాలికి గాలిన పండుటాకుల ధ్వనింపఁ జేయుచుఁ దిరుగు చున్నది? మృణాల తంతుమార్దవములగు బాహుల తలనెత్తి మల్లెపందిరి సమీపించుచున్నది. పూవులు గోయుటకుఁ గాఁబోలును? ఆ మోహనాంగి మదన మహారాజు నర్చించునా? కాముక చైత్రయాత్రా ప్రవీణుండగుఁ బంచ బాణుని వాడికోలలోయనఁ బరుప హృదయ భేదకములగుఁ గ్రేగంటి చూపు లిటే ప్రసరింపఁ జేయుచున్నది. నన్నుఁజూచెనా యేమి? కాదు కాదు. ఆసతి పలుచని తెల్లని వస్త్రమునుండి కదళికా స్తంభ సదృశములగుఁ బెందొడల కాంతులిగువంకల బంగరు నీరుపోయ సంపూర్ణ చంద్రికా పరిహసన శీలంబగుదర హాసమున నధర కాంతులు సంకీర్ణంబులగుఁ ద్రిలోకపవిత్రమూర్తిని రసాల మకరంద సన్నిభములైన చక్కని ముద్దు పలుకులతోఁ గఱగించునో గదా? జక్కవ పిట్టల నెక్కిరించు వట్రువ కుచ ములచేత వంగిన మైదీవియతో నేమహాపురుషు నాలింగనము, జేసి బ్రహ్మానంద పదమొసఁగునో కదా? అట్టి యదృష్టవంతుఁ డెవఁడో తోఁచదు.

ఉ॥ శారది చంద్ర హృద్యమగు ♦ సారసలోచన మోముఁ దమ్మిఁగ
న్నారఁగఁజూచి సంతసిలు ♦ నంతటి భాగ్యము గల్గెఁగాని శృం
గారవతీలలామయెడఁ ♦ గల్గిన చిత్తముఁ ద్రిమ్మరింపఁగా
నేరపు చాలదయ్యె రమ ♦ ణీమణి లాతియొ యేమొయెంచఁగన్

(ఆలోచించి) కాదు కాదు. ఆకాంత యవివాహితయే. కాదేని

నిషధాధి పతుల హృదయము లన్యకాంతలందు లగ్నము లగునా? ఇందలి యథార్థమేదియో తెలియక చనరాదు.
(మఱల జూచి)

తే॥ నడుము మిక్కిలి సన్నము ♦ నడక చాల
దిన్నన వెడంద కనులు పే ♦ రెన్నఁదగిన
పడఁతిరా దానిఁ గన్న న ♦ బ్బా యటంచు
మైమఱచి సోలకుండు నే ♦ మదనుఁడైన.

తే॥ కలికి లేఁగాను గగనమై ♦ క్రాలు కతన
నీల నీరదరేఖగా ♦ నెగడు వేణి
తరుణి వచన సుధాధార ♦ గురిసినాఁకుఁ
దృప్తిఁగావింపకున్న జీ ♦ వింపఁగలనే?

(మఱల జూచి) ఎవరితోడనో మాట్లాడుచున్నట్లున్న దే. ఆ చెలి యెవ్వత?

చ॥ కిసలయ తుల్యమైన ♦ యొక కేలసరోజముఁ బూని మోమునన్
ముసరెడి షట్పద ప్రకర ♦ ముం విసుఁగొందుచుఁ బైఁటకొంగుతో
విసరుచు మెల్ల మెల్లఁ జెలి ♦ పిల్వఁగఁ బల్కుచు ముందుఁజూచుచున్
మిసమిసలాడు చిల్కవలె ♦ మెల్లఁగ నిట్టులె వచ్చునద్దిరే,

నే నాకాంతలకుఁ గనరాకుండ నీతీగె గుబురుచాటుననుండి వారేమి చేయుదురో చూచెద గాక—(అట్లు జేయును)

(రంగముఁ తరువాత సీమంతినీ మధురికయుఁ బ్రవేశింతురు)

మధురి—చెలీ! ఈ మందమలయానిలుఁ డెంతయసాధ్యుఁడో చూడుము.
సీమం—అతఁడసాధ్యుఁడని నీకెట్లు దెలియును?
మధు—మెల్ల మెల్లఁగావచ్చి యావతల పయ్యెదలలోఁ జేరి గిలిగింతలఁ జేయువాఁ డసాధ్యుఁ డుగాఁడా?

సీమం—నీకీ చమత్కారపు మాటలెవ్వఁడున్నవే. అదిగో ఆసంపెంగ తీఁగెను జూడుము. నీరు చాలక కాఁబోలు వాడి పోయి యున్నది.

మధు—నీయూహ సరియైనదికాదు.

లే॥ సాటిలత కూనలెల్లను ♦ సంతసమున
నుచిత సహకార సంగతి ♦ నొందియుంటఁ
బుష్పవతి యౌకనకవల్లి ♦ ముదముఁ గూర్పఁ
దగిన యాలంబనము లేక ♦ తల్లడిల్లెడి.

చంద్రా—(స్వగతము) ఆహా. ఆమగువ యెంత చమత్కారముగా మాట్లాడుచున్నది.

మధు—ఇది సరియే కాని యీద్రాక్షాలత కుచభారమున వంగిన సీవలెనే యెట్లు వినమ్రమైనదో చూడుము.

సీమం—నీకుఁ జనువిచ్చినందులకా యట్లు బల్కుచుంటివి ?

మధు—అట్లైన నింకమాట్లాడను లెమ్ము. (ముఖము ద్రిప్పును)

సీమం—మధురికా! పరిహాసమునకంటిని. కోపమెందులకు?

మధు—నాకు నీపైఁగోపము గలుగునా ? (నిదానించి) ఆనాగవల్లి పోఁకమ్రాఁకు నెట్లు పెనచికొనినదో చూచితివా ? నీవును లోకాధికుఁడగు రాజేంద్రు నాలింగనముఁ జేసినయట్లే మనోహరముగా నుందువుకదా యని నాకోరిక.

చంద్రా—(స్వగతము) ఆమధురిక వచించు నొక్కొక్క మాటకు నా హృదయము పరిపరి విధములఁ బరుగెత్తుచున్నది. హృదయమా! తొందర పడకుము.

సీమం—మధురికా! ఈమాటలతో నేమి కాని యంతఃపురమునందలి చిత్రపటమును దెమ్మని నీతోఁ జెప్పితిని గదా ? అదియేది ?

మధు—అప్పటినుండియు మాటల సందడిని మఱచితిని. ఇదిగో (ఇచ్చును)

సీమం—(తీసుకొని) చెలీ! ఈపటమును జూచినప్పుడే నాహృదయ మిందలి పురుషునిపైఁ జిక్కుకొని మఱియు "దీనినిఁ జక్కఁగా నెప్పుడు చూతునా;" యని యువ్విళ్లూరుచున్నది. నేటికి నీస్నేహమువలన నది సిద్ధించెను. (పటమును జూచుచుండును)

మధు—అమ్మా! దేవతాపూజకన్న గౌరవముతోఁ జూచుచున్నావు. విశేష మేమియు లేదు గదా?

సీమం—విశేషమా! ఎక్కువగాఁగలదు. చూడుము (చూపుచు) ఆహా కమ్మని పరిమళము గుమ్మరించు నిట్టి బంగారు శరీర మెందైన గందుమే?

చ॥ దిరిసెనఁపుం బ్రసూనము గ ♦ తిఁ మృదువై తగుమేనమేల్మి బం
గరు వలువన్ ధరించి యొక ♦ కంటఁ గృపామకరందబిందువుల్
గురియుచు నొక్కకంట రిపు ♦ కుంజర గర్వ వినాశసింహ తా
స్ఫురణముఁ జాటు నీనృపతిఁ ♦ జూడఁగఁ గన్నులు రెండుచాలునే.

చంద్రా—(తనలో) ఆతరుణీమణి యెవ్వరిదో చిత్రపటమును వర్ణించుచున్నదే? అట్టి యదృష్టవంతుఁ డెవఁడో కదా?

మను—(చూచి) ఆహా! ఈవిశాలమగు వక్షస్థలమెంత బలిష్ఠముగా నున్నది? ఈసుందర పురుషుఁ డేభాగ్యవతికై నియమింపఁ బడెనో.

సీమం—చెలీ! ఈతని స్వభావమును వర్ణించుటకు నాకు సామర్థ్యము లేదు. చూడుము.

ఉ॥ అచ్చెరువైనయొక్కవిప ♦ యంబునుగాంచియొయేమొకాని యీ
పచ్చని మోమునన్ మొలకఁ ♦ బారిన లేనగవంకురించి వి
ద్యుచ్ఛయమట్లు వెల్గు నధ ♦ రోష్ఠరుచిన్ గయిసేయుమారునిన్
మెచ్చని వాఁడుఁబోలెఁగను ♦ మీఁయులరారుచునున్న వాఁడహా

ఈమహాపురుషునిఁ గన్నులారఁ బ్రత్యక్షముగఁ జూచుభాగ్యము నాకెట్లు గల్గును. చిత్తరువునుండియే నామనస్సును హరించిన యీ సౌందర్యరాశి ప్రత్యక్షముగఁ గన్పడినచో నాశరీరమెల్ల గొల్లఁగొనకుండునే?

చంద్రా— (తనలో) అదేమీ? చిత్రపటగతుఁడైన పురుషుని మోహించినట్లు మాట్లాడుచున్నది. ఇఁక నాయాశ హుళక్కియేనా యేమి? తొందర పడఁగూడదు. సాంగముగాఁ దెలసికొనక దేనిని నిర్ధారణము జేయరాదుగదా?

మధు—అమ్మా! ఇట్టి లలితాంగుఁ డీప్రపంచములో నెందైననుండునా? లేక శిల్పి తన చాతుర్యముఁ దెలియునట్లు లిఖించియుండునా?

సీమం—మధురికా! ఇట్టి మహాపురుషుఁడుండఁడనియా నీయభిప్రాయము? కాదు కాదు. ఈరాజకుమారుని సోయగముఁ జక్కఁగా వ్రాయలేక శిల్పకారుఁడేదో యొకరీతిఁగ వ్రాసెను గాని ప్రపంచములోని వాఁడే యీతఁడు.

మధు—ఏమో నమ్మఁజాలను.

సీమం—తెలసినది నీయుక్తి. ఎట్లైన నీచక్రవర్తిపై నిలచిన నామనస్సును మఱలింప నిట్టి పలుకుఁ బలుకుచుంటివి గాని యెంత బలవంతము జేసినను నాహృదయమీ పురుషుని విడువఁజాలదు.

చంద్రా—(తనలో) ఇఁక సందేహ మెందులకు? ఆమె పరకాంతయే. అయినచో నా కుడికన్నదరుచున్నదేల? ఆచిత్తరువు నాదేయైయుండునా? ఇందలి యదార్థమెట్లు తెలియును. "ఎట్లైన నీచక్రవర్తిపై నిలచిన నామనస్సును" అని యన్నది కదా! అందలి పురుషుఁడు చక్రవర్తియని యెట్లు తెలసికొనఁగలిగెనో ఆమె బుద్ధి కౌశల్యమెంత పొగడఁదగియున్నది. చక్రవర్తియని

యే నిశ్చయించిన! (అర్ధోక్తితో) మధురిక యేమో చెప్పఁ బోవుచున్నది.

మధు—భర్తృదారికా! ఇట్టి పురుషుఁడుండునో లేదో తెలియదు గదా? ఒకవేళ నెందైననుండునేని యేదేశము నేలువాఁడో యే వెలఁదిని వరించెనో? అట్టివానిఁ గోరినఁ బ్రయోజన మేమి? నీవంటి సర్వజ్ఞురా లందనిపండ్ల కఱ్ఱుఁజాచునా?

సీమం—ఎప్పుడీ పటమును జూచితినో యప్పుడే నామనస్సు నీచక్రవర్తికిఁ గప్పముగ సమర్పించితిని. ఈమహారాజెన్నటికైన నన్నుఁ బాణిగ్రహణముఁ జేయఁడేని నిరంతర బ్రహ్మచర్యము నవలంబించి సామేశ్వరు నారాధించుచుందును. ఒకర సొమ్ము నింకొక రనుభవింప నర్హులగుదురా? అది న్యాయమా?

మధు—బాగుగానున్నది. నీవలెనే నేనుఁగూడ నేజయంతుని చిత్తరువునోగాంచి యాతనిదప్ప నింకొకనిసి గోరనని యసవచ్చును గదా?

సీమం—(వినిపించుకొనక) చెలీ! ఈచిలుకపిల్ల నావలకుఁ గొట్టుము. నాయధరమున వ్రాలుచున్నది.

మధు—దానిదోషముగాదు. నీకెమ్మోవిని దొండపండని భ్రమించి యుండును.

సీమం—అబ్బా! ఇగి నన్ను నిలువనిచ్చునట్లు లేదే. ఇగియుఁగాక

సీ॥ ఒకయెడఁ దమ్మిపా ♦ నకముఁ ద్రావిమదించి
ఝుంకారము లొనర్చు ♦ షట్పదములు
నొకయోరఁదాము మె ♦ క్కి కడమ చివురులఁ
బెట్లకై గొనిపోవు ♦ పికసమూహ
మొకచాయఁ దమపిల్ల ♦ లకు ముక్కుకొనలచే
గొజ్జంగి నీరొ్వయు ♦ గోరువంక

నోకవంకమావిపం ♦ డ్లకునై బరస్పర
కలహంబు లొనరించుఁ ♦ జిలుకకూన
తే॥ లోకజెన తమాలభూరుహ ♦ ప్రకరదర్శ
నమున భ్రాంతివడి నటించు ♦ నెమలిపిట్ట
లహహ యవివాహితలకు ను ♦ ద్యానవనుల
నిలువఁ దగదనియెడి పల్కు ♦ నిజమువచ్చె.

(ముందుజూచి) అయ్యో! అయ్యో! భయంకరమగు సింహము వచ్చుచున్నదే ఎందుబోగలము ?

మధు—(భయముతో) ఎవరైనఁ బరోపకార పారీణులిందున్నచో మమ్మీ సింహమువాతఁ బడకుండ రక్షింపుఁడు.

చంద్రా—(వినితనలో) అఘటనఘటనా సమర్థుఁడగుఁ బరమేశ్వ రుఁడు సింహశాబకవ్యాజమున నామనోహారికి నన్నుగపర్చు కొన నవకాశమొసంగెను. ఇట్లే యాకాంత కరగ్రహణము గూడఁ గల్గించునుగాక.

తే॥ ఆర్తరక్షాపరుండైన ♦ యవనినేత
కరమునఁ గృపాణముఁ దాల్చి ♦ తిరుగుచుండ
నబలలకు భీతిఁగొల్పెడు ♦ నట్టిచెనఁటి
మెకమునిలువంగ నేర్చునే ♦ మెలఁతలారా !

అని (ప్రవేశించి) కాంతలారా ! ఆదుష్టమృగమెందు బోయెను.

సీమంతి—(చెట్టుమాటుగున నుండిచూచుచుండును.)

మధు—అయ్యా ! మిమ్ముఁగాంచి యామార్గమునఁ బరుగెత్తినది.

చంద్రా—అదిగో పోవుచున్నది. దానినిప్పుడే పరిమార్చెద (పోవును)

మధు—(సీమంతినిని సమీపించి) భర్తృదారికా ! ఈతఁడేనా నీ మనోహరుఁడు. చిత్రపటమునందలి రూపమునకు నీతనికి భేదము గానరాదు.

సీమం—(తలవంచుకొనును)

మధు—సిగ్గుపడెద వేల? త్వరగాఁ జెప్పుము నీనాథుండు మఱలవచ్చు నేమో?

సీమం—ఆహా! నా వ్రతము ఫలించినది. నేనుధన్యురాలను.

చంద్రా—(ప్రవేశించి) అబలలారా! ఆక్రూరమృగమువలన మీకు బాధ లేకుండఁ జేసివచ్చితిని. భయపడకుఁడు.

మధు—అయ్యా మీదయవలన నిప్పటికిఁ బ్రాణసంశయమునుండి విడువఁబడితిమి. మీరు మాపాలటి భగవంతులు.

సీమం—(తనలో) ఆహా! ఏమియీతని సౌందర్యము. ఈతఁడే నా హృదయమును హరించిన చతురుఁడు.

చంద్రా—(తనలో) దైవసంకల్పమెంత విచిత్రము. ఈసుందరి నిక్కముగా నామనోహరి యగునేమో? కాకున్ననిట్టి యసంకల్పిత సమాగమమేలఁ గలుగును? కావున నీమె యెవ్వతెయోయడిగి తెలిసికొనెదను. అంతవఱకు నాహృదయము స్థిరపడదు. (ప్రకాశము) చెలులారా! ఈయారామమునఁ జరించు మీ నగరమిచ్చటి కెంతదవ్వు.

మధు—(తనలో) మెల్లఁగా నేదియో సంబంధముఁ గల్పించును గాఁబోలు (ప్రకాశము) మహారాజా! అదే కనుబడునది యమునానది. దానికావల మానగరమెంతో దూరములేదు. ఈవరారోహ చిత్రవర్మకూతురు సీమంతిని యనునది. ఇక్కడికిఁ బూవులు గోసికొనుటకై వచ్చిమీవలన రక్షింపఁ బడితిమి. మీమేలు మఱువఁజాలము.

చంద్రా—(తనలో) ఈ నాప్రియ చిత్రవర్మమహారాజు తనయయా? అందువలననే నాకుఁ బ్రియురాలైనది. మా మేనమామ కీతఁడు పినతండ్రి కుమారుఁడని తండ్రిగా రప్పుడప్పుడు జెప్ప వినుచుందును. (ప్రకాశము) చెలీ! మీకు నేనేమేమి మేలుగావించితిని. రాజుల కబలల రక్షించుట విధిగావున నట్లుజేసితిని. ఇందాధిక్య

మేమికలదు? నిరంతర కాళిందీజలస్నానపూత శరీరలగు మిమ్ముఁ జూడఁ గల్గినందులకు నే నెంతయు ధన్యుఁడను.

సీమం—(తనలో) ఏమి యీచాతుర్యము.

మధు—అమ్మా! ఈ యవాంతర సంభాషణమువలన మహారాజుగారిని సత్కరించుట మఱచితిమి. ఇదిగో జాజిపూదండతోడి సహకారఫలమునొసఁగి గౌరవింపుము. (ఇచ్చి రాజునుగాంచి) మహారాజా! ప్రాణదాతలగు మీకు మాయెడఁ గనికరము గలుగవలయును.

సీమం—(సిగ్గు నభినయించుచు నొసఁగఁబోవును.)

చంద్రా—చెలులారా! మీ వచనామృతమును శ్రవణపేయముగఁ ద్రాగుటవలన నాకు సంతృప్తికలిగినది. మీ యాదరాతిశయము చాలదా?

సీమం—(మధురికను జూచును.)

మధు—దేవా! ఇంచుక విన్నవించుకొనెదను. రాజదర్శనము రిక్తహస్తములతోఁ జేయరాదుగాన యీగురుపూజా నియతయగు మాచెలిని మన్నింపుఁడు.

చంద్రా—(స్వగతము) అయినచో ముఖ్యముగా గ్రహింపవలసినదే? (ప్రకాశము) మీ యిష్టమట్లు నడచువాఁడఁగదా?

సీమం—(తలవంచికొని రాజున కుపహార మిడును.)

చంద్రా—ఆహా! ఏమి నా యదృష్టము.

సీ॥ అవ్యక్త మధురంబు ♦ లగు శుకారవములు
భూసు రాశీర్వాద ♦ ములుగఁ జెలఁగ
మధుపాన గర్వితా ♦ మధుప ఝుంకారముల్
తనరారు మంగళ ♦ ధ్వనులుగాఁగ
బవన సంచలిత పు ♦ ష్ప పరాగసంభూతి
కమనీయమగుఁ బరా ♦ గమ్ముగఁ దనర

శారికాచంచు సం ♦ చయ పతద్దాడి మీా
ఫలబీజతతి యత్న ♦ తలుగ నలర
తే॥ నఖలవల్లీ సువాసిను ♦ లభినుతింప
హృదయగతమగుఁ బ్రణయంబు ♦ నెఱిఁగి నటులఁ
దరుణి ఫలరూపమైన చి ♦ త్రంబు నాకు
ధారవోసెను నా కోర్కి ♦ తీరునటుల.

(ప్రకాశము) కాంతా! మౌక్తికాహారోచితమగు నీ వక్షంబున నీ పూదండ యెంతయు రమ్యముగా నుండునుగదా? (సీమంతిని మెడలో వేయును.)

మధు—(తనలో) ఇంతవఱకే నా పని.

(తెఱలో) అహ్మా! అమ్మగారు మీాకై వెతకుచు నిటే వచ్చుచున్నారు.

మధు—(సీమంతినిగాంచి) చెలీ! మహారాజుగారిని నమస్కారపూర్వకముగఁ బునస్సమాగమ మర్థింపుము.

సీమం—(రాజునకు నమస్కరించును.)

చంద్రా—తరుణీ! నీవు నాకొనర్చిన గౌరవము మఱపునకురాదు. ఈ యంగుళీయమును నీకడ నుంచుము. (ఇచ్చి) పరమేశ్వరుఁడు పునస్సమాగమముఁ గూర్చునుగాక. (నిష్క్రమించును.)

సీమం—(చూచుచు) చెలీ! నా మనోహరుని దర్శనమింకెన్నటికో గదా. ఆహా. మనసార నాతని వదనాబ్జమునైనఁ గాంచనైతినే!

మధు—పరమేశ్వరుని సంకల్పము వృథా కాదుగదా. ఇప్పటికి మనము వచ్చిచాలా ప్రొద్దైనది పోవుదమురమ్మ. (ఇరువురునిష్క్రమింతురు)

(రంగము:-పర్ణశాల. విచారముతో ప్రవేశించి,)

మైత్రేయుడు—వేటకై యరుదెంచిన చంద్రాంగదునకు యమునా పరిసరోద్యానవనమున విహరించు సీమంతినిని గాన్పించుటకై సుమేధసుని నియమించితిని. ఆతఁడింతవఱకును రాలేదు. పనియయ్యెనో కాలేదో తెలియదు. ఆహా! ఎట్టిసమధ్యానకను,

చ॥ తన సరివారుమెచ్చఁగ న ♦ ధర్మమొ ధర్మమొ యేదియోయొకం
డనుపమలీలఁ జేయుటకు ♦ నై శపథంబొనరించి దాని వి
త్తనమునునాటి యయ్యది వృ ♦ థాయగునో ఫలమిచ్చునోయటం
చనయముఁ జంచలించుహృద ♦ యంబొక కుమ్మరసారెలాగునన్.

(ఆలోచించుచుండును.)

సుమేధసుఁడు—(ప్రవేశించి) గురువర్యా! నమస్కారము.

మైత్రే—(చూచి) వత్సా! వచ్చితివా! ఇప్పుడే నీజాడ తెలియకపో యెఁగదాయని విచారించుచుంటిని. (సంతోషముతో)వచ్చితివా?

సుమే—తమ సంకల్పము వ్యర్థమగునా? సిద్ధసంకల్పులుగదా తమరు.

మైత్రే—(ఆశ్చర్యముతో) అదెట్లు? చెప్పుము.

సుమే—మృగయా పరిసమాప్తియైన వెంటనే వేటకాండ్ల కాజ్ఞ యిచ్చి నిషధాధిపతి గృహోన్ముఖుఁడయ్యెను.

మైత్రే—(వేగిరపాటుతో) అదేమీ? నీవేమి చేయుచుంటివి?

సుమే—సావధానముగా వినుఁడు. అప్పుడు నేను "ఆలశ్యాదమృతంవిష" మను తమ యుపదేశమును స్మరించి వివిధాభిధానములచేఁ బ్రసిద్ధములైన తమతమ వేటకుక్కలను వెంటఁగొని మృగయు లరిగిన వెనుక ప్రయాణముఁ జేయఁబోవుఁ జంద్రాంగదు నెదుటఁ దమకు గాలవ్యుఁడు గురుదక్షిణగనొసఁగిన విచిత్రసింహశాబక మును బ్రవేశింపఁ జేసితిని.

మైత్రే—బాగు! బాగు! మంచిపనియే చేసితివి. రమ్యవస్తుగ్రహణలాల సుఁడగు నృపాలుఁడా సింహమును గ్రహింపఁదలఁచి దానివెంటఁ బోవుననియా? నీబుద్ధికౌశల్య మెంతయుఁ బొగడఁదగియున్నది. తరువాత.

సుమే—తరువాత నా సింహపోతమును గ్రహింపక మఱలనని భూనా థుఁడు దానివెంటఁబడి యమునా తీరారామమునకుఁ జేరెను.

మైత్రే—

చ॥ తనకు గురూపదేశమె ప్రధానముగాఁ దలపోసి పాపమై
నను సుకృతంబెయైన విడనాడక గౌరవపూర్వకంబుగా
నొనరిచి యొజ్జనెమ్మది కహింపు కుతుకంబొనరించు వాఁడెపో
కనుఁగొన శిష్యసత్తముఁడు గాని మఱొక్కరుఁడౌనె చెప్పుమా,
కష్టపడి చదువు జెప్పినందులకు నాపేరునిల్పినవాఁడవు నీవేనోయి తరువాత నేమయ్యెను. అప్పటికి సీమంతిని యుద్యాన వనమునకు వచ్చియుండెనా?

సుమే—ఏల రాకుండును. త్రికాలజ్ఞులుగదా మీరు. రాజుగా రుద్యాన వనమునకు వచ్చువఱకు సీమంతినియుఁ జెలికత్తెయుఁ నొకచిత్ర పటమును జూచుచు నందలిపురుషు ననేకరీతులఁ గొనియాడు చుండిరి.

మైత్రే—ఏమీ ! చిత్రపటమును సీమంతినిచూచెనా? ఆహా నామాట చెల్లినది.

సుమే—ఆ చిత్రపటమెవ్వరిది. ఆ విషయమెట్టిది. వినిపింపుఁడు.

మైత్రే—నీకింకను దెలియదా? ముందుగాఁ జంద్రాంగదునకు మృగయా ప్రయాణముఁ గల్పించి యాతని చిత్రపటమును మాందుకేయుని వలన వరుణాస్పదపురముఁ జేర్పించితిని. అటుపిమ్మట నిన్నీపనికిఁ బంపితిని. తరువాత నేమి జరిగెను.

సుమే—జరుగుట కేమున్నది. తరువాత నాసింహము సీమంతినీ మధు రికల భయపెట్టుటచే వారుపెద్దపెట్టునఁ గేకలువేయఁ జంద్రాం గదుఁడు వారల సమీపించెను. పరచిత్తగ్రహణశీలయగు మధు రిక వారికుపుర భావోద్రేకముఁ దెలసికొని సీమంతినిచే రాజున కుపహార మిప్పించెను.

మైత్రే—ఇంతవఱకుఁ జాలును. క్రమముగా నాయికానాయకులు మోహపాశబద్ధు లగుదురు. నేను కృతకృత్యుడ నగుదును. ఇఁక

నీవుపొమ్మా. నాకు స్నానసమయ మగుచున్నది. ఇదుగో యింకొక్కమాటవినుము. నా చెప్పినట్లు గాలవ్యుఁడు మున్నగు మీ సహాధ్యాయులఁ గొంతకాల మిందే యుండునట్లు జెప్పుము. అవసర మగునేమో.

తే॥ చిత్రవర్మకూతు ♦ సీమంతినిని బలు
వెతలఁబెట్టివ్రతము ♦ విడచునటుల
నలుపకుందునేని ♦ శాశ్వతంబగు విప్ర
కులమునుండి యపుడె ♦ తొలఁగువాఁడ.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ మీనాక్ష్యైనమః.

# సీమంతినీ నాటకము.



## తృతీయాంకము.

[రంగము:-రహస్య భవనము. సీమంతిని మధురిక ప్రవేశింతురు.]

సీమం—ఆహా! వయస్యా! సుగుణనిధియగు నా భూకాంతుఁడు

తే॥ కాకతాళీయముగ నందుఁ ♦ గానవచ్చి
యంగనా మానస ధనాప ♦ హారణశీలుఁ
డగుటఁ జూచుచు నుండగ ♦ నతఁడు నాదు
హృదయమును గూడఁ గొనిపోయె ♦ నేమనందు.

నాకీ ప్రతీకారశూన్యమగు వేదన యెంతకాల మనుభవింపఁ వలసి యున్నదో కదా?

శా॥ ఆకర్ణాంబుల మైత్రికై చనెను నే ♦ త్రాంభోజముల్ యవ్వన
శ్రీకాంతిన్ బ్రకటించు మోము మదన ♦ వ్రీడాకరంబైన యా
యాకారంబు విలాసవైభవము సుం ♦ తైనన్ గనుంగొన్న నా
భూకాంతున్ విడనాడి పోఁగలరె యే ♦ పూర్ణేందుబింబాస్యలున్.

ఆ జగదేకసుందరు సాన్నిధ్యము లభించినంతమాత్రమున శరీరము నెఱుఁగకుంటిని గాని వాని యాశ్లేషసౌఖ్యము గలుగు నుపాయ మరయనైతిని.

తే॥ తేనియలవానఁ గురిసెడి ♦ తేటబలుకు
విభుని వదనాబ్జముననుండి ♦ వెడలునపుడె

నిర్వికారచైతన్యమై ♦ నెగడునాకు
నట్టియూహ జనించు ♦ నే యకట్టకట.

ఇంక నామనోహరునెట్లు దర్శింపఁగలను. ఆదయానిధిని మన సార మాట్లాడించుటకై నను నోఁచనైతినే?

మధు—కాంతా! ఆశాంతిమూర్తి మనను విడచి చనునప్పుడు పున స్సమాగమ మర్థించితివిగదా ఈవంత యెందులకు?

సీమం—చెలీ! ఏటిమాటలివి ఆమహారాజునకు నేనుజ్ఞాపకముందునా? ఆతఁడు మననుగూర్చి యాచారము నొప్పునట్లనెనేకాని యది నిజమగునా

సీ॥ సకల సామంత రా ♦ జన్యపరీవృత
గోష్ఠివినోదముల్ ♦ గోరువాఁడు
రసవత్ప్రబంధ ని ♦ ర్మాణ ధీకుశలులౌ
కవులతోఁ బ్రొద్దులఁ ♦ గడపువాఁడు
సంతతస్వాన్వయ ♦ సార్వభౌమాళితో
స్వైరవిహారముల్ ♦ సల్పువాఁడు
ప్రౌఢాంగనా మధ్య ♦ భాగంబునఁ జేరి
వివిధ శిల్పంబుల ♦ వెలయువాఁడు

తే॥ పావకసమానభోగి భూ ♦ పాలవర్యుఁ
డాతఁడట మాటలాడిన ♦ యంతమాత్రఁ
గనికరంబున మరలనఁ ♦ గలయవచ్చు
ననుట విశ్వాస పాత్రమా ♦ నా తలంప.

మధు—సుమంగలీ! యాక్షత్రియ కులావతంసము నీతో "సాధ్వీ నీవు నాకుసల్పిన గౌరవము మఱపునకు రా"దని చెప్పెనుగదా. ఇంతలోనే మఱచునా?

సీమం—నీకీ భ్రాంతియేల రాజులకు సమయోచిత కార్యాభిరతియే కానిపూర్వగాథలు స్మృతికివచ్చునా?

మధు—అట్లయిన నీకీప్రయోజనములేని యాశయెందులకు? అన్నియుఁ దెలసిన నీవేయిట్టి యజ్ఞానము వహించిన మావంటివారి గతి యేమగును.

సీమం—చెలీ! నీకిట్లు మాట్లాడఁదగునా? మనస్ఫూర్తిగఁ గాంత యెవ్వనిఁ గోరునో యాతనినే సేవింపవలయునుగాని వేఱొకనిఁ గోరంజెల్లునా? అదిసతులకు విరుద్ధముగాదా ఎప్పుడాయువతీ మన్మథు నంతఃపురమునందలి చిత్రపటమునఁ గాంచితినో యప్పుడే నాహృదయమాతని కర్పించితినని చెప్పితినిగదా నా నిజాభిప్రాయమును వినుము.

సీ॥ మినువాఁక తఱగల ♦ మెలఁగెడి రాయంచ
రొంపిగుంటల సంచ ♦ రింపఁ గలదె
తొలినీరుదాల్పు చి ♦ న్గులఁ ద్రాఁగువానకో
యిల యెండమావుల ♦ కేగఁగలదె
వెల్లిమాఁకు పూవుఁదే ♦ నెలఁ గ్రోలుమగముద్దు
గలకాళ్ల పుర్వఁతు ♦ మ్మలకుఁ జనునె
క్రొమ్మావి పండుల ♦ నెమ్మిమెక్కెడి చిల్క
ముష్టికాయలఁ దిన ♦ నిష్టపడునె
తే॥ యిష్టదైవము దయచేసి ♦ యిచ్చెననుచు
నృపతియెడ నిలచిన నాదు ♦ హృదయమింకఁ
బరునిపైఁ బోవదింతయుఁ ♦ బ్రళయమొక్క
కాలమున సంభవించినఁ ♦ గానియెపుడు.

ఎన్నటికైన నాశరీరము ననుభవించుట కారాజమౌళియే యధికారియగును.

మధు—నీకిట్టి నిశ్చయమే కలిగిన నింతయారాటమేల? ఆయమకుంఠిత పరాక్రమనంతునకు నీయందుమాత్ర మనురాగమెందులకుండదు?

సీమం—నాకట్టి భాగ్యమా? నాయందు సోమశేఖరునకుఁ గరుణ యుండవలయునుగదా!

మధు—అమ్మా! నీయందా రాజచంద్రుని కనురాగముండదేని పట్ట మహిషి ధరింపఁదగిన యంగుళీయకము నీకిచ్చునా? ఏదీ యాయుంగరమిటు దెమ్ము దానియందలి వర్ణములేవియో చూతము. (తీసుకొని చూచి) ఆహా నీవదృష్టవంతురాలవే?

సీమం—ఎందువలన?

మధు—ఈ యుంగరమున "నిషధాధిపతి, అని చెక్కబడి యున్నది. చూడుము. మీయమ్మగారప్పుడప్పుడు నిన్ను నిషధాధి పతికే యీఁదలఁచినట్లు జెప్పుచుండెడిది.

సీమం—(తనలో) ఆహా! దైవసంకల్ప మంతయు ననుకూలముగనే యున్నది. నాయదృష్టమేమి చేయునో?

మధు—భర్తృదారికా! నీవింక విచారింపకుము. నేను మనవృద్ధకంచుకిని సహాయముగఁగొని నీ మనోహరుని జాడఁ దెలిసికొని వత్తును. అతఁడు నూరువిధముల నాయుద్యానవనముననే తిరుగుచుండును.

సీమం—గౌరీదేవినర్చించు వేళయయినట్లున్నది పోవుదమా?

(నిష్క్రమింతురు.)

(రంగము:అంతఃపురమునందలిసోపానమార్గము. మధురిక ప్రవేశించి)

ఎట్టి కష్టమైన ననుభవింపవచ్చునుగాని విరహవ్యథ ననుభవించుట కష్టముగదా.

ఉ॥ ఎంతయొ సంతసంబు మెయి ♦ నెప్పుడు జూచినఁగాని మేన ర
వ్వంతయుఁగార్శ్యముల్ గలుగ ♦ నట్టుల నవ్వుచునుండునట్టి సీ
మంతిని రాజపుత్రునెడ ♦ మక్కువచే నెడలేక మన్మథా
క్రాంతశరీరయై వెతలఁ ♦ గాసిలుచున్న దిఁకేమిసేయుదుల్.

ఆరాజకుమారుఁ డెందుండునని వెదుకఁగలను. కానిమ్ము. మును పటి యుద్యానవనముననే యన్వేషించెదను. (వృద్ధకంచుకీ వృద్ధకంచుకీ

కంచుకి—(ప్రవేశించి)ఏమి ముంచుకొని పోయినదని గొంతెత్తి గుండెలు బ్రద్దలగున ట్లరచుచున్నావు? నిదానింపుము.

మధు—నీకేమి? కొంపలు గాలుచున్నను నీకు నిదానమే. ఇప్పుడు మనము యమునానదిని దాఁటిపోవలయును.

కంచు—ఎందుకొఱకు ? పనిలేకయా ? చాలు చాలు. నీయెగతాళి కట్టిపెట్టుము. ప్రొద్దు పొడువలేదు. అప్పుడే యమునానది దాఁటవలయునఁట. ఈనాఁడూరిలో చిత్రము జరుగును. చూడ వలదా ?

మధు—ఏమిచిత్రము? బొమ్మలాటయా ? నామాట విని వత్తువా రమ్ము. లేదేని బలవంతముగా లాగుకొనిపోవుదును. రమ్ము. రమ్ము (లాఁగుచున్నది.)

కంచు—అబ్బా ! ఆగుము వత్తును. కాని నీవు వినలేదా ? అహా ! ఏమని చెప్పగలను.

మధు—ఆనసుఁగు డేదియో తొందరగాఁ జెప్పుము.

కంచు—నిన్నటి యుదయకాలమున నీగ్రామమున కొక విచిత్రమైన సింగపుఁగొదమ వచ్చి కనుఁబడినవారి నెల్లఁ బైకొనుచు నంత టంతట బెదరిపోజొచ్చెను.

మధు—ఏమీ ? సింహమా ? ఈయూరికి వచ్చినదా ? దాని నెవ రైనఁ బట్టుకొనఁ బ్రయత్నింపలేదా ?

కంచు—ప్రయత్నమునకేమి. ముందుగా నందఋను దమతమ శక్తి కొలఁది ప్రయత్నించిరి. కాని యది చిక్కలేదు.

మధు—ఎవరికైనఁ బ్రమాదము సంభవింపలేదుగదా ?

కంచు—పాపమది యెవ్వరికి నెట్టిప్రమాదము గలిగింపలేదు. దానినిఁ బట్టుకొనుటకై వేఁటకాండ్లుఁగూడ ననేకవిధములఁ దమసాను ర్థ్యముల వినియోగించిరి.

మధు—అంతజిత్తులమారిదా ? (స్వగతము) అప్పుడుద్యానవనమున మాకు రాజదర్శనము గలిగించినది కాదుకదా. (ప్రకాశము) అది కొంచెము కుఱుచగను బలిష్ఠమై యుండునా ?

కంచు—అవు నట్లే యుండును.

మధు—తుదకది యేమయ్యెను.

కంచు—మహారాజుగారు దాని పరాక్రమము నెఱిఁగి యెవరైనను దానిని జంపక పట్టుకొనినచో గొప్పబహుమతిఁ జేయఁబడునని ప్రకటించిరి.

మధు—(తనలో పైకిఁజూచి) సీమంతిని యదృష్టవంతురాలే యగునా? (ప్రకాశము) తరువాత నెవరైనఁ బట్టుకొనఁ బ్రయత్నించిరా?

కంచు—ఎవరో యొక రాజకుమారుఁడు నిన్నటినుండియు దానిని వెన్నంటి తిరుగుచున్నాఁడఁట.

మధు—(సంతోషముతో) నిజమేనా ! మనము చూచివత్తము రమ్ము.

(తెఱలో)

మ. సకలారాతికులాంబుదప్రకర జం ♦ ఝామారుతంబైన మా
మక బాణాసననిర్గతోగ్రశరసం ♦ బంధంబు వాటిల్లినన్
గకుబంతప్రచవిష్ణు సత్వతతి వే ♦ గన్ బంచతంజెందు నూ
రక ప్రాణంబులఁ బాయనేటికి మృగేం♦ద్రంబా ! యికన్ జిక్కుమా.

మధు—కంచుకీ ! రమ్ము. ఆరాజకుమారుఁడు సింహమును బట్టుకొన బోవుచున్నాఁడు. (తనలో) కంఠస్వరమట్లే యున్నది:

(ఇరువురు నిష్క్రమింతురు.)

చంద్రా—

తే. చిక్కితివి నాకుఁ బ్రాణావ ♦ శేషముగను
బాలపంచాస్యమా యెందుఁ ♦ బారఁగలవు
సాధుజనకృతమగు బ్రయా ♦ సంబు పూర్ణ
ఫలమొసంగక చెడిపోవఁ ♦ గలదె తలఁప.

(అని సింహమును దరుముకొనివచ్చును.)

(తెఱలో)

మహాభాగా! విపక్షశిక్షాదక్షుంబగు నీకాక్షేయకమునకీ బాల సింహమును గుజ్జిఁజేయుట పాడిగాదు. ప్రాణములతోఁ బట్టుకొనుమనియే రాజశాసనము.

చంద్రా—ఎక్కడివీకోపోపశమన వాక్యములు? నేనుమాత్రము దీనిని జేతులారఁ జంపఁగలనా? (అని పట్టుకొనును.)

భటులు—(ప్రవేశించి) అయ్యా! మీరు చిత్రవర్మ మహారాజుగారి కడకు దయచేయుఁడు.

చంద్రా—ఎందువలన?

భటు—సింహమును బట్టుకొంటిరిగావున,

చంద్రా—సింహమును బట్టుకొనుట దోషమా?

భటు—దోషముగాదు. రాజాజ్ఞయే.

చంద్రా—ఎట్టిదాయాజ్ఞ?

భటు—ఈసింహమును బట్టుకొనినవారికి బహుమానము చేయఁబడు నని ప్రకటించుట మీరెఱుఁగరా?

చంద్రా—అదేదియు నాకుఁ దెలియదు.

భటు—తెలియకున్న మించిపోయిన దేమికలదు? బహుమానము గలుగునుగదా. దయచేయుఁడు.

చంద్రా—

తే. నాకునేన దీని ♦ నాకానలోఁ గాంచి
పట్టుకొనఁగఁదలఁచి ♦ వచ్చినాఁడఁ

గాని రాజుమెప్పు ♦ కై వచ్చినాఁడనే
యిటుల: బల్కుచుందు ♦ రేలనయ్య!

భటు—అయ్యా! మీయిష్ట మెట్లున్నను రాజశాసన మగుటవలన తప్పదు.

చంద్రా—అట్లయిన వచ్చెదను. మీరు ముందు నడువుఁడు.

(భటులు నిష్క్రమింతురు.)

చంద్రా—నామనోహరి సీమంతిని చిత్రవర్మ మహారాజుగారి కూతురు గదా. నాకీతఁడు వరుసకు మేనమామ. సింహమును బట్టుకొనినవారికి బహుమతి చేతుమని రాజుగారు సాటించిరి. కావున నేనీభటులవెంటఁ జని సమయానుకూలముగ నావాంఛ వెలిబుచ్చెదను. కాంతా! నన్ను నీదయుకుఁ బాత్రునిగఁ దలఁచితివా?

తే. నాకుఁ బ్రియురాలవగుదువు ♦ నీకు నేను
ప్రియుఁడనగుదునో కానో యే ♦ రీతి నిజముఁ
దెలియఁగానేర్తుఁ దల్లిదం ♦ డ్రులను వీడి
చెలియ నినుగూడకయె రెంటఁ ♦ జెడుదునేమొ.

నీయాలింగన భాగ్యముఁ గల్గింపవేని యున్మత్తుఁడ నగుదును. (నిదానించి) ఇంతకథానకము గల్గించిన పరమేశ్వరుఁ డూరకుండునా? (నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.





శ్రీ మీనాక్షై నమః.

# సీమంతినీ నాటకము.



## చతుర్థాంకము.

రంగము:—వివాహమంటపము.

(చిత్రవర్మ, ఇందుకళ, సీమంతిని, మధురిక, చంద్రాంగదుఁడు ప్రవేశింతురు.)

చిత్రవర్మ—(చంద్రాంగదు నుద్దేశించి) వత్సా! శ్రద్ధతో వినుము.

చ. సకలపయోధివేష్టిత వి ♦ శాలమహీతలచక్రశాసనం
బకుటిలరీతిఁ జేసిన ధ ♦ రాధిపుఁబట్టి వీవు సింహశా
బకమిషచేతఁ గూర్చె భగ ♦ వంతుఁడు మాసుత నీకు నీవె యం
తకుఁ జతురుండ వీసతిని ♦ దారఁగఁ గైకొను నైషధేశ్వరా!

(అని చంద్రాంగదునిచేత సీమంతినికిని సీమంతినిచేతఁ జంద్రాంగదునకును బూలహారములు మెడలో వేయించును.)

చంద్రా—(నమస్కరించును.)

చిత్ర—ఆయుష్మంతుఁడా! మాఁటమాత్రమున సకలసర్వంసహాపరిపాలనంబుఁ గావించి యిప్పటికిని రేఁపటికిని సంకల్పమాత్రాశేషపాపనివారకుండై పవిత్రమూర్తియనఁ బేరువడసిన నీపితామహుఁడు నలచక్రవర్తివలన మీకును మాకును సంబంధము వచ్చుచున్నందులకు భగవంతుఁ డనుగ్రహించి విచిత్రసింహశాబకవ్యాజంబున మఱల నాసంబంధమునే కూర్చెను.

చంద్రా—మామగారూ ! పరమేశ్వరుని సంకల్పమది.

చిత్ర—అందులకు నాకెక్కుడు సంతోషమేకాని పూజ్యులగు మీతలిదండ్రు లీవివాహమునకువచ్చుట సంభవించనందుల కొక్కింత విచారమయ్యెడు.

చంద్రా—ఇదంతయు వారి యనుగ్రహప్రాప్తమే.

చిత్ర—ఇంకొక్కమాట వినుము. (సీమంతిని చేయిబట్టుకొని)

సీ॥ సంధ్యవేళల విలా ♦ సముగఁ బూఁదోఁటల
కరుగుటకైన ♦ నాయాసపడును
పెంచిన చిలుకలే ♦ పెద్దగఁగూసిన
విని సహింపఁగలేక ♦ వెఱపుఁజెందు
క్షణమైన జననిబా ♦ సిన జగమెల్లను
గూలిపోయినరీతి ♦ గుందుచుండు
గారీశునర్చించు ♦ కార్యంబుఁదక్క వే
ఱొకపని కింతేని ♦ యోపలేదు.

తే॥ కలిగినది మాకు నీపెద్ద ♦ కాలమునకు
త్రిపురసుందరి దయచేతఁ ♦ దెఱవనింక
మమ్ముఁ దలపోసి తాతగు ♦ నమ్మలరసి
లలన హృదయంబుఁగాంచి యే ♦ లంగదయ్య.

(అని చేతిలో నిడును.)

ఇందుకళ—(కన్నీరు విడచుచు తనలో) కుమారీ! నేటికి నీవు పరుల సొమ్మైతివా! అయ్యో! నీవు నా కనులముందర నల్లారుముద్దుగ నాడుచుండ సంవత్సరమైనను నొక గడియరీతిఁ గడపు నేను నిన్ను విడనాడి క్షణమొకయేడుగ గడుపఁగలనా? తల్లీ! సీమంతినీ! (ప్రకాశము) అమ్మా! నీవత్తవారింటికిఁ బోయి వత్తువా! అయ్యో! ఇంక నే నెవరినిగాంచి సంతోషింతును. కొమరుఁడవైనను గూతువైనను నీవేయని నమ్మికొనియుంటినే. నాకు గతియేమి?

సీ॥ ప్రాణపదంబుగా ♦ భావించి పెంతు వీ
శుకపోతము లెవారిఁ ♦ జూచి బ్రతుకు
సోదరీభావంబుఁ ♦ జూపి రక్షింతు వీ
కలుకులేగతిఁ బ్రొద్దుఁ ♦ గడపఁగలరు
మెలమెల్లఁ బద్మముల ♦ నిలిపి చరింతు వీ
హర్మ్యాగ్రము లికెట్లు ♦ లలరఁగలవు
తండ్రీ ! యటంచు సం ♦ తసముఁ గూర్చెదవీ మ
హారాజికెట్లు ధైర్యంబుఁదాల్చు
తే॥ సోమవారంబు లందున ♦ సోమనాథుఁ
బూజఁగావింతు వాగృహం ♦ బున నెవార
లరసి యద్దాని తలుపుఁ దీ ♦ యంగఁ గలరు
తనయ ! నీవధిపుని వెంటఁ ♦ జనిన వెనుక.

సీమం—(జనాంతికము) తల్లీ ! నీకీ విచార మెందులకు? పురాకృత పుణ్య పాపానుభవంబునకై జన్మించిన ప్రతివారికిని దమతమ పుత్రికల నొకరి కొసఁగి పరలోకమునఁ జింతించుఁ బితృ పితామహులకు గతులు గలిగించుటుచిత మేకదా?

చంద్రా—మామగారూ ! అనుజ్ఞ నొసఁగుదురా ! జననీ జనకులు నా కొఱకై యెంతయో విచారించుచుందురు.

చిత్ర-(తనలో) ఈయాయుష్మంతుఁ డప్పుడే ప్రయాణముగూడఁజేయు చున్నాఁడే. నా కన్నుల యెదుట నీ నూతన దంపతులొక్కింత కాలముందురుగదా యని తలఁచిన నా తలంపు కొనసాగదా? (ప్రకాశము) నాయనా ! మీ వివాహమై యిప్పటికొక వార మైనను గడువలేదు. అప్పుడే ప్రయాణమా? నీకన్న స్థానవయో జ్యేష్ఠుఁడనగు నన్నుఁ దిరస్కరింపక కొంతకాల మిందుండి తరు వాత వెళ్లఁగలవు.

చంద్రా—మీమాట శిరసావహింప వలసినదే కాని నాకింటికడఁగలుగు సంకటములవలన నిందుండ సమయముగాదని విన్నవింతును.

మ॥ అతివృద్ధుల్ తలిదండ్రులు లోకకు నిముసం ♦ బైనన్ నన్నుఁ బాసినన్
బ్రతుకన్ లేమని వంతఁ గుందుదురు స ♦ ర్వంబైన రాజ్యం బధి
ష్ఠితమై యేండ్లుచనంగలేదు రిపుకో ♦ టిన్ ద్రుంపఁ బ్రస్థానమే
మతి నిర్ధారణ సేయలేదెటుల సం ♦ భావింతు మీయానతిన్.

కావున నన్ననుగ్రహింపుఁడు పోయివత్తుము.

చిత్ర—(సీమంతిని సమీపించి) తల్లీ పోయివత్తువా? త్రిపురసుందరీ ప్రసాదమున జన్మించితివి కాన మా వంశమునకును, జక్రవర్తినిఁ బెట్టఁబట్టితివి గాన యింద్రసేనమహారాజు వంశమునకును వన్నెఁ బెట్టుము.

ఇందుకళ—సీమంతినీ! నీవు మనయింటఁ జరించిన ట్లత్తవారియింటఁ జరింపరాదు సుమీ! వృద్ధులగు మీ యత్తమామల నెట్లుసేవింతువో?

సీ॥ ఎల్లవేళల నోక్క ♦ యేవిధంబున భర్త
యందునఁ జనువుఁ జే ♦ యంగరాదు
అరుణోదయంబగు ♦ నపు డెట్టితటినైన
నించుకంతయును ని ♦ ద్రించరాదు
అత్తమామలసేవ ♦ యాగుదాక కలనేని
త్వరపడి నీ రైనఁ ♦ ద్రావరాదు
దాసీజనం బెట్టి ♦ తప్పుఁ జేసినఁగాని
గినిసి వారలను శి ♦ క్షింపరాదు
తే॥ సోమవారవ్రతంబును ♦ సాముజేసి
కలిమిగలదంచు గర్వించి ♦ మెలఁగరాదు
తెలివి! మమ్ముఁ దలంచి ♦ చింతింపరాదు
సాధ్వివై చరియింపఁ గ ♦ ష్టంబురాదు.

చిత్ర—అమ్మా పోయిరమ్ము. (చంద్రాంగదుని జూచి) వత్సా! అప్పు డప్పుడు మీ క్షేమ సమాచారములు దెలుపుచుండుము. పోయి రండు.

చంద్రా—(సీమంతినిచేయి బట్టుకొని పోవుచుండును.)
ఇందుకళ—(చూచుచుండును)
చిత్ర—(వేగిరపాటుతో) వత్సా! చంద్రాంగదా! ఇంకొక్కమాట.
చంద్రా—(వెనుకకు వచ్చును)
చిత్ర— మఱచితిని. అమ్మాయి యాచరించు సోమవార వ్రతమునకు వార్షికోత్సవము నిందే సలుపవలసియుండును. అప్పటికి యాజ్ఞవల్క్య మునిశేఖరుఁడును రాఁగలఁడు. అంతవఱకిందుండ నిచ్చగింపుము.
చంద్రా—ఆదినమింకెంత కాలము గలదు?
చిత్ర—సమీపించుచున్నది.
చంద్రా—చిత్తమట్లేకానిండు.
ఇందు—అమ్మాయీ! సోమశేఖరు నారాధించు వేళయయినది. పోవుదము రండు (అందరు నిష్క్రమింతురు)

(రంగము. పర్ణశాల)

(సుమేధసుడు ప్రవేశించి)

నేటికి నాకెట్టి యకార్యమాచరింప వలసివచ్చెను. చిరకాల మిత్రమగు సోమవంతునెట్లు నమ్మించఁగలను? వలదనిన మైత్రేయుని కోపాగ్నికి శలభమును గాక తప్పదు. ఆచరించిన విశ్వాస ద్రోహము గలుగుటయే గాక సాధుజన వంచకుఁడనగుదును. అయ్యో! నే నేమహాపాతకముఁ గావించితిని. అసత్యమన్నఁ బ్రాణములనైన సరకుఁగొనని నేనా సోమంతునితో నసత్యమెట్లాడఁగలను. ధనార్జనమను మిషచే సోమవంతుని వలనఁ గృత్రిమాంగనా రూపముఁదాల్పింపఁ గలనా? కానిమ్ము నాపాపఫలము. ఎట్లైనను దప్పదుగదా. అదుగో సోమవంతుఁడిటేవచ్చుచున్నాఁడు. గంభీరముగా నుండెదను.

సోమ—(ప్రవేశించి) బావా! ఈనాఁడేల నీవు రహస్యముగనున్నావు?

సుమేధ—ఇఁకమీఁద మనజీవయాత్ర యెట్లుజరుగునాయని యాలోచించుచున్నాను. వినుము. మనమిరువురము మేనత్త మేనమామల కొడుకులమగుటయే కాక పుట్టినదిమొదలొక ప్రక్కఁ బండి యొక యింటఁ బెరిఁగితిమి.

సోమ—అందువలననే మన తలిదండ్రు లొకరనొక రెడఁబాయక యొకరనొకరు దిరస్కరింపక చరింపుఁడని శాసించిరి.

సుమే—మనము సకలశాస్త్ర పారంగతుఁడగు మైత్రేయ మునికడ శుశ్రూష సలిపి.

చ॥ పురుడగు వారి యిండ్లకును ♦ బోయి మధూకరమెత్తి యొజ్జయుక్
గరువమడంగునట్లు గతి ♦ నాబుగఁ బల్కిన మారువల్కక
క్షురమొక లక్ష్యగాఁదలఁచి ♦ శాస్త్రములెల్లఁ బఠించి యొజ్జలం
దరు గురుతుల్యులంచన హి ♦ తంబుగ నొక్కటియై మెలంగమే...

సకలశాస్త్ర పురాణేతిహాస ప్రబంధ రచనాధురీణులమై పదునెనిమిదేండ్ల యీడుగలిగి వివాహోచితులమైయున్న మనను గాంచిన తలిదండ్రులనెంతయో యదృష్టవంతులని చెప్పవలయును.

సోమ—నిజమే. ఇదియది యననేల? మనకుఁ దెలియనిదొకటి యీసృష్టిలోఁగలదా?

సీ॥ పరిపూర్ణశాస్త్ర సం ♦ పదనుగాంచినయేని
యల చతుర్ముఖుఁడైన ♦ నబ్బురపడుఁ
గొంతెత్తి రాగమొ ♦ కింతఁ బాడుదుమేని
శారదాదేవి యా ♦ శ్చర్యమొందు
బుధమనోరంజనం ♦ బునకుఁ బూనుదుమేని
నవరసజ్ఞులకు సం ♦ తసముగల్గు

రసవత్ప్రబంధ ని ♦ ర్మాణశక్తినిఁగన్న
నాదికవీంద్రున ♦ కగునుభీతి

తే॥ నిఖిలశిల్పంబులందున ♦ నేర్పుఁజెంది
సకలభూపాలమౌళిరా ♦ జత్కిరీట
రత్నఘృణిచయరంజనా ♦ హ్వాతనుగన్న
వారమైతిమి పితరుల ♦ వలనమనము.

సుమే—ఇట్టి ప్రజ్ఞావంతులమగుటకు మనతలిదండ్రులెంత కష్టపడిరో తెలియునుగదా.

తే॥ ఉపనయనమాదిగా నిఖి ♦ లోపకృతులఁ
గష్టనిష్ఠురములకోర్చి ♦ కాయమెల్ల
జీర్ణమైనను బుత్రుల ♦ సేమమునకె
తిరిగిరవ్వారి ఋణమెట్లు ♦ దీర్పఁగలము ?

బుద్ధిమంతులమగు మనమింక మనకై తను ధనంబులవెచ్చించిన జననీజనకుల నెక్కుడుభక్తితో సేవింపవలయును. మన పాండిత్యముఁ బ్రకటించుటకిదియే తగిన సమయము. ప్రతిమనుజునకును ధన మావశ్యకముగదా? మనకు విద్యావినియోగమునఁ గాక ధనములభించునట్లు దోఁచదు.

తే॥ జననమాదిగ దేహమ ♦ స్తమయమొందు
వఱకుఁ బ్రాణంబుగలయట్టి ♦ వారికెల్ల
ధనమవశ్యంబు వలయుఁద ♦ త్యక్తులైన
వారి కిహపరసౌఖ్యముల్ ♦ దూరమగును.

కావున నేదియో యొకమార్గము నాశ్రయించి లక్ష్మీప్రసాదముఁ బడయుటమంచిది.

చ॥ కొడుకుసమర్థుఁడై తనకుఁ ♦ గోరినదానిని యెల్లఁదెచ్చి యి
చ్చెడుఁగదయంచు నాసఁ దన ♦ సేమముకై సుఖమన్నమాట లే

కిడుములఁ జెంది తుందు పిత ♦ యెంతయు సంతసమొందునట్లుగా
గడన యొనర్పఁగావలయుఁ ♦ గావె ధనంబును బుత్రుఁడో చెలీ !

సోమ—నీవు చెప్పినదంతయు నిజమే. కాని యీమహాకలియం దేవిధముగ మనము ధనమార్జింపఁగలము? ఇంద్రజాలమునం దారి తేరిన వారికిఁగాక మముఁవంటి ఛాందసులకు ధనములభించునా? ఎవ్వఁడు కాలుఁడుఁగలఁడని భయపడక చేయున దొకటియుఁ జెప్పునదొకటియుఁ జూపునదొకటియునుగఁ జరించునో వాఁడే కదా యిక్కాలంబునఁ శ్రేష్ఠుఁడు.

సుమే—నీకా విచారమెందులకు. నేనేదియేని యొక యుపాయమాలోచింతునుగదా? నీవు మాత్రము నేనుజెప్పినట్లు వినుచుండుము.

సోమ—శాస్త్రవిహితమై సాధుజనగర్హితము గాదేని కడజాతివాని యుపదేశమైనఁ దలఁదాల్పవలయునని శ్రుతులు వక్కాణించుచుండు. అందులో సహాధ్యాయివియు నాసేమము గోరువాఁడవును వయోజ్యేష్ఠుఁడవగు నీపలు కాలింపకుందునా ?

సుమే—వీలగునంతనఱకు నీవన్నటులే నడచుకొందుము. కాని యొకప్పుడు పనిగల్గెనేని యధర్మమునకుఁ గూడ భయమొందఁ గూడదు. అందుకొఱకే నీకుఁ జెప్పవలసివచ్చెను.

సోమ—(తనలో) అధర్మమార్గసంచారులగుఁ బండితమ్మన్యుల కుపదేశముఁజేయ సమర్థుఁడగు నీతఁడు ధనమే లోకముగఁదలఁచి వేదబాహ్యునివలె సంచరింపఁ నెంచుచున్నాఁడేమి? చూడఁగా నానిశ్చయముఁగనుఁగొనుట కిట్లు మాట్లాడుచుండెనని తోఁచుచున్నది. నా సహజగుణమునకుఁ గళంకము గలుగునా ? (ప్రకాశము) బావా !

శా॥ మాయావాగురమందుఁ జిక్కి వెలిరా ♦ మార్గంబుఁ గానంగలే
కాయాతప్పడుఁద్రోవలఁ జను చని ♦ త్యంబైన దేహంబుకై

యాయాంసంబును జెందుఁ బామరునియ ♦ ట్లాతుచ్ఛసౌఖ్యంబులన్
హేయంబంచుఁ దలంపవైతిగద నీ ♦ కీబుద్ధి న్యాయంబొకో.

సుమే—సోమవంతా! ఇది కృతయుగమని భావించుచుంటివా యేమి? దేశకాలపాత్రములరసి యేసమయమున కెట్లు నడువవలయునో యట్లు నడువకున్న మనుష్యునకు జీవయాత్ర యెట్లు జరుగ గలదు? ధనమూలముగదా లోకము.

సోమ—ధర్మమార్గ సంచారులకు దేశకాల పాత్రములతో బనియేమి? లోకముతో నేమి సంబంధము? అట్లుగాక యింద్రియములకు లోనై సకల కార్యములకుఁ దలలొగ్గుఁ బామరులకు స్వాతంత్ర్యముండునా? అది లేనిచో నంతయు నడవిఁగాచిన వెన్నెల యోగదా? నీవెఱుఁగని ధర్మమేది?

తే. దేహమస్థిరమని ♦ తెలిసియు నడవినఁ
బడఁగనేల న్యాయ ♦ పదము విడచి
పరమునకు విరోధ ♦ భావంబుఁ జూపిన
నిహసుఖంబు గల్గు ♦ టెట్లొ చెపుమా!

జలబుద్బుదప్రాయమైన సంసారమున భ్రాంతివిడక యింద్రియ శాసనంబు మాఱిఁదాల్చి శత్రువర్గంబు నిరోధింపలేకున్నచో మనచదువులేటికి? ఈనాటికిట్టి యుత్తమజన్మము గలుగుటకుఁ గారణమైన నూహింప నవసరముండదా? ఎందరు మహానుభావులు నీచమగు లోకసంబంధము విడచి దేహసన్న్యాసముఁ గావించి సంతత చంద్రశేఖరపదధ్యాన పరాయణులై బ్రహ్మానందసౌఖ్య మనుభవించుటలేదు? వారందఱు నీ క్షణికమగు ధనమును గాంక్షించిరే? పోనిమ్ము ఏది యెట్లున్నను ధనమే ముఖ్యమని భావింతునందువా? నిశ్చలచిత్తయై లక్ష్మి యొక్కచోఁ గాపురముండునా!

చ. రసికులఁగన్న కోప మను♦రాగవిహీనత ధీరులందు, సం
తసమును జూపదెప్పుడు ను♦దారత గల్గినవారిమీఁదఁ, దా

మసగుణమరానియుండు నభిమానము గల్గినచోటc, బండితా
గ్రేసరులc జూడనొల్లదు పరాకుననైనను గాని యెప్పుడుc.

మఱియును,

తే. అహహ చంచలచిత్తయై యందఱకును
బగలcగల్గించి యొక్కచో నెగడలేక
దేశమెల్లెడc దిరుగు న ధీరయైన
లక్ష్మిపై నుంచెదేల నీ లక్ష్యమిపుడు.

సుమే——సోమవంతా! తల్లిదండ్రులా, వయోవృద్ధులగుటచే నిలు వెళ్ల లేకc గ్రాసమునకుసైతము మొగమువాcచి యున్నవారు. కుటుంబమా! కడుపెద్దది. పిత్రార్జితమగు ద్రవ్యమా మనకొఱకే వినియోగింపబడినది. లోకానుభవము చాలని నీవూరక వేదాంతములు చెప్పుటయే గాని నామాట విననైతివి. ఏమిసేయుదును. ముఖ్యముగా మనయిరువురి వివాహములకుc జాల ద్రవ్యము గావలయుగదా? మఱియుc గుటుంబరక్షణ మావశ్యకముగాదే! ఏరీతిగ నింతద్రవ్య మార్జింపcగలను. అకటా దైవమా! నాయాశలన్నియు నడుగంటించితివా? నాయుపాయమున కీతcడు సమ్మతించినc బదునాల్గుతరములకైనc దఱుగని ద్రవ్యము లభించునని తలంచితినే? ఇంతలో నాడెందమున కిట్టివిచారముc గల్గించితివా? (నిదానించి) మిత్రుcడా! లోకాధారురాలగు మంగళదేవత నేల దూరెదవు? ఆమె యను గ్రహముననేగదా పిపీలికాది పర్యంతము సుఖించుట.

సామ——బావా! నీవిట్లు ధనలోలుcడవగుదువని యెన్నcడైనc దలంచితినే? నీకెంతలో నెంతతాపత్రయముగల్గెను. వారికి మోక్షము గలుగును గాని యనభిజాతయగు లక్ష్మిని నమ్మికొనినవారికి ముక్తికాంతా సాధకపాటములు దెఱువcబడునా? అది యటుగాక.

ఉ॥ మాటలురానివార లవ ♦ మానము సైచెడివార లిష్టకా
   ర్యాటన పాటవంబుమెయి ♦ నాడియుఁ దప్పెడివారు లోభులై
   కోటిగడించియుఁ మిగులఁ ♦ కోటిగడింపఁగఁ జూచువారు గా
   కేటికి యోగ్యులౌదురిహి ♦ హా! సిరికెన్నఁగ మాద్యశోత్తముల్.

సుమే—(తనలో) ఈతఁడెంతబోధించినను నామాటవినునట్లులేదు. నా సామర్థ్యమెల్ల ధారబోసి యుక్తిగా దారిలోనికిఁ దీసుకొని వచ్చెదనుగాక. (ప్రకాశము) నీవాడిన పలుకులు సుధారసపూరితములు వేదతుల్యంబులు. అయినను సమయమునుబట్టియు స్థితినిబట్టియు ధర్మశాస్త్రములకు వ్యవస్థజేయఁబడి యున్నది. ఋషిప్రోక్తంబులగుఁ గొన్నివచనంబులు భాష్యకారులచేత నియమింపఁబడినది నీవెఱుఁగుదువుగదా? ఏది యెట్లున్నను మనుష్యనకుఁ బ్రతివానికిని జీవనము గడువవలయునా లేదా?

సోమ—అవును. నిజమే.

సుమే—ధనములేకున్న నది జరుగుటెట్లు? ఉదయము మొదలు సాయంత్రమువఱకు ధనముతోడనే వ్యవహరింపవలయునే?

సోమ—అందువలన ధనమవుసరమందువా? అవును.

సుమే—ఏదియో యొకమార్గ మవలంబించక ధనమెట్లు చేకూరును?

సోమ—ఇట్టిప్రశ్నోత్తరము లెందుకు? ముఖ్యముగా నీవుచెప్పునది ధన మార్జింపవలయుననిగదా? నీయిష్టమెట్లుండిన నట్లు జేయుచుండుము. నేనుదాసీనుఁడనై యుండెదను.

సుమే—(స్వాగతము) ఇఁక జేపవలలోఁ బడినట్లే. (ప్రకాశము) అట్లులయిన మహాదోషము గలుగును. ఏలనందువా! నాపన్నినపన్నుగడకు నీయుదాసీనత విరోధించును. అందువలన సంపాదనకు లోపము వాటిల్లఁగలదు. దానమనము బ్రహ్మచారులమైయుండవలసివచ్చును. అందుకత మనయనంతరమునఁ బితృదేవతలకు దుర్గతి గలుగును.

సోమ—(స్వగతము) ఈతఁడు చెప్పినమాటలన్నియు యథార్థములే? అధర్మమన్న భయమొందు నాకెంతమాత్రమును రుచింపవు. అయినను నిహపరలోకములందుఁదలిదండ్రులకానందముగల్గించుటకు ధనమావశ్యకముగాన తుద కవియే శిరసావహింప వలసి వచ్చెను. నాజాతకమెట్లున్నదో యట్లు జరుగునుగాన యతనియుప దేశమే స్వీకరించెదను. (ప్రకాశ) మహాభాగా ! ఇంతవఱకు నీకెదురాడినందుకు నన్ను మన్నింపుము.

సుమే—(స్వగతము) ఈతఁడధర్మభీరుడైనను నాచాతుర్యము వలనఁ గొంతవఱకు మార్గములోనికి వచ్చినాఁడు. కాని నాపూనిన యకృత్యమునకు సమ్మతించునోలేదో. (ప్రకాశము) సోమవంతా! నామాటవినుము.

తే॥ అవనిపాలురు ధనలోభు ♦ లైనకతన
వట్టిమాటల సంతోష ♦ పఱచుచుంద్రు
గాని మనవంటి వైదికా ♦ గ్రణుల నెపుడు
సత్కరింపఁగఁ దలఁపరే ♦ చాయఁగనిన.

కావున మనదారిద్ర్యము తొలఁగుటకై యొకచక్కనియుపాయ మరసితిని. కలదుగదా చిత్రవర్మ మహారాజుగారి తనయ సీమంతినియను సాధ్వి! ఆమె యిప్పుడు సోమవాసర వ్రతముఁ జేయుచు నావ్రత ముద్యాపనమగువఱకును నియమముగ దంపతి పూజలఁజేయఁ గంకణముఁ గట్టుకొనినది. ఆమెచేయు దంపతి పూజవలనదారిద్ర్యదేవత నిడువనీడలేకయల్లాడుచున్నదిసుమా?

సోమ—(స్వగతము) ఏమీ! రాజులెల్లలు ధనమదంబునఁ బండితసత్కారముల మానివేసిరా? కావచ్చును. కలికాలముగదా? అదియట్లుండ దంపతీపూజాప్రస్తావనముతోఁ బనియేమి? బ్రహచారుల మగు మాకు దానియవలన ప్రయోజనమేమిగలుగును? ఈతని మాటల కర్థమగుటలేదే? (ప్రకాశము) ఆమె బ్రాహ్మణపూజఁగాని పండితసత్కారముఁగాని చేయుటలేదా?

సుమే—చేయుచునేయున్నది. కాని సోమవారవ్రతమందు దంపతీపూజ యే ప్రధానమగుటవలన దంపతులగువారికే యెక్కువలాభము.

సోమ—దానికి మనమేమిచేయఁగలము, మనయోగ్యతనుబట్టి సత్కరించునుగదా?

సుమే—ఆసత్కార మాత్రమున మనదారిద్ర్య మెట్లుదొలఁగును.

సోమ—అట్లని మనముచేయునదేమి?

సుమే—మనమిరువురమును కృత్రిమదంపతులమైయామెచేతఁబూజింపబడుదుమేని లక్ష్మీప్రపుత్రులమగుదుము.

సోమ—(చెవులు మూసికొని) హరిహరీ! ఎట్టి యశ్రావ్యము విన వలసివచ్చెను. (తన నుద్దేశించి) ఛీ సోమవంతా! ఇట్టిదుష్కాలమున నీవేలఁ బుట్టితివి. ఇంకను నీదేహము పతనముగాదేల? బావా! ఇదెక్కడి విపరీతము.

మ. సరివారల్గనుగొన్న నవ్వుదురు శా ♦ స్త్రంబుల్ విరోధించు ని
ష్ఠురవృత్తిన్ దరిఁజేరనీరు తలిదం ♦ డ్రుల్ వంతచే మిత్రులం
దరు శోకింతురు భూసురాన్వయమహా ♦ త్రంబౌ కటా యెట్లుదు
ర్భరనిందావహమైనఁ గృత్రిమవధూ ♦ వాల్లభ్యముఁ జెందుటల్.

తే॥ పూర్వజన్మార్జితంబైన ♦ పుణ్యముననె
గాక పూరుషజన్మంబు ♦ గలుగఁగలదె
యట్టిపురుషున కొకధనం ♦ బబ్బుననుచు
స్త్రీత్వమును సంఘటించుట ♦ చెడుగుగాదె. ✓

ఇదియా నీవు చేయదలచినపని.

సుమే—ఇతరులకొఱకై తనలాభముఁ జెడఁగొట్టుకొనుట ప్రాజ్ఞుని లక్షణమా? తత్కాలవేష ధారణమాత్రమున స్త్రీత్వమున నిలుచునా? నీకీవెఱ్ఱితన మెందులకు? సిరిరా మోకాలొడ్డునారుఁ

గలరా ? యుగభేదమున ధర్మము మారునుగదా ? ఇటు వినుము.

గీ. శ్రితజనావనుండు ♦ సృష్టిస్థితిలయాత్మ
కమగు జగముభర్త ♦ విమలమూర్తి
బ్రహ్మగన్నవాఁడు ♦ పరమేశ్వరుఁడు తొల్లి
యొక్కయవసరమున ♦ నువిదగాఁడె?

మఱియు నెందరో మహానుభావు లాయాసమయమును బట్టి శాస్త్రవిరుద్ధముగ సంచరింపరే ? కావున శ్రుతివిహితము గాదని యేవగింపక, దోషంబని విముఖుఁడవుగాక నింద్యమని తలంపక, యకార్యమని త్రోసివేయక, మోసంబని భయమొందక, పితృసంరక్షణ పరాయణుఁడవై, మిత్రమునందు గౌరవముంచి లోకయాత్రానుకూలముగ నామాట వినుము.

సోమ—అట్లయిన మన కీయకార్యము తప్పక శిరసా వహింపవలసినదే?

సుమే—మిత్రమా ! ఎవ్వఁడేని తాఁజేయఁబూనిన పనిని నిందించునా? అంతకన్న వేఱొండుదోషము కలదా ?

సోమ—తప్పదుగా ? వేఱుమార్గము లేదుగా ? అయినచో మనలో నంగనయెవరు ?

సుమే—ఎవరని యడుగనేల ? పురుషుఁడు స్త్రీవేషము వేయునప్పుడు తగినట్లుండవలయును గదా ? దానికి మనలో నర్హులగువారు దాల్పవలయును.

సోమ—(స్వగతము) ఈతఁడు నాకొంపకే యెసరుఁ బెట్టుచున్నాఁడు. అయ్యో ! నేటికి నావలనఁ బవిత్రమైన వంశమునకుఁ గళంకము గల్గునా ? కట్టా దైవమా ! నాకెట్టిగతిఁ గల్గింపనెంచితివి? వేదవేదాంగపరిజ్ఞానము గలిగి జగత్పండితుఁడనైన నాకా యీనీచాతినీచమగుఁ గృత్రిమవధూవేషముఁ దాల్పవలసిన వ్రాఁత.

పూర్వజన్మకృత సుకృతఫలంబగుఁ బురుషరూపము మార్చి బుద్ధిపూర్వకముగ స్త్రీని గావలయునా? ఓ చంద్రసూర్యులారా! పంచభూతములారా! దిక్కులారా! ధనలోభమున నిట్టి ఘోరకార్యాచరణమున కొడిగట్టిన నన్ను శిక్షింపరేమి? (ప్రకాశము) బావా! నాకీ యధర్మసంచారము మాన్పలేవుగా? పాండిత్యగర్వాంధులగు మనీషితల్లజుల శిరంబుల వంచుకొనఁజేయు నాకా నిండుసభలో నస్వతంత్రయగు స్త్రీవలె గోళ్లుగిల్లుకొనుచుఁ దలవంచుకొనుట తప్పదుగా? చిరకాలము గురుసేవఁజేసి యభ్యసించిన విద్యల కిదియా ఫలము?

సీ॥ ప్రతిపక్షగర్వ ని ♦ ర్వాపకంబగు లేఖ
నెసఁగుఁ జేతుల గాజు ♦ లెట్లుదాల్తు
భసితత్రిపుండ్ర వి ♦ భ్రాజితంబగు ఫాల
దేశంబునఁ జుక్క ♦ దిద్దు టెట్లు
కవిజనహృదయ భీ ♦ కరములౌ పల్కుల
శృంగార రసము వ ♦ ర్షించు టెట్లు
అమల కాషాయాంబ ♦ రాంచితంబగుఁ గటిఁ
బసిఁడి వడ్డాణంబు ♦ పూనఁగు టెట్లు

తే॥ స్ఫటిక మాలలఁ గ్రాలు వ ♦ క్షస్స్థలమున
గురుకుచంబుల ధరియించి ♦ కులుకు టెట్లు
దైవవశమున లభ్యమై ♦ తనరునట్టి
పుంస్త్వమున్వీడి స్త్రీత్వంబు ♦ బొందు టెట్లు?

ఆహా! నాయీ దుష్టచరిత్రము రాఁబోవు మహాకవుల రూపకములకు విషయమై సామాజికుల హృదయమందొకవిధమగు భావోద్రేకమును గల్గించునా? ఎట్టి పవిత్రవంశమున నెట్టి దుర్మార్గుఁడను బుట్టితిని.

తే॥ సోమరాతుని పుత్రుఁడు ♦ సోమవంతుఁ
డొక్కతఱి ధనాసక్తి వే ♦ దోక్తవిధికి

భంగ మొనరించి స్త్రీరూపుఁ ♦ బడసెననుచు
జనులు నను బ్రువ్వఁదిట్టరే ♦ సంతతంబు.

సుమే—సోమవంతా! ఎందులకీ విహితకార్య దోషాన్వేషణము. విచారించిన తప్పునా?

సోమ—(స్వగతము) నిజమే. చేయఁదలఁచినదానికై జింతించినఁ బ్రయోజనమేమి? (ప్రకాశ) బావా! నాప్రాప్తికై నీవేమి చేయఁగలవు. భవిష్యన్నాటకి మునకు నాయికగానున్న నాకుఁ గొన్ని పరికరము లవసరముగదా? వానికై త్వరయొనర్తుము రమ్ము.

ఓ త్రిమూర్తులారా!

తే॥ వైదికాచార నిర్ణయ ♦ పద్ధతికి వి
రుద్ధముగ సంచరించి ప్ర ♦ సిద్ధమైన
కులమునకుఁ గళంకంబును ♦ గూర్చునట్టి
యధముఁ డీతని వీక్షింప ♦ రయ్యమీరు.

(ఇరువురు నిష్క్రమింతురు)

(రంగము పూజామండప సమీపము. కంచుకి ప్రవేశించును)

ఔరా! ఏమి యీ బ్రాహ్మణుల సాహసము చూచుచుండఁగనే కంటిలో దుమ్ముఁబోసి దోఁచుకొనిపోవుచున్నారే? పండితులమనియుఁ గవులమనియు దైవజ్ఞులమనియు వైద్యులమనియు నసత్యములఁజెప్పి యిచ్చినంతజాలక పీడింప మా రాజుగారివద్ద తమ తాతసొమ్మైన దాఁచిరా? ఇదెక్కడ వ్రతమోకాని దంపతీపూజలఁట, బ్రాహ్మణ సంభావనలఁట, వాండ్లబొందయఁట వాండ్ల బోలెయఁట. ఈ సోమవార వ్రతము పూర్తియగులోపల మారాజుగారిపనియుఁ బూర్తి యగును. సుమ్మాటికి నిజము. అదుగో అప్పుడే కొందఱు

పోవుచున్నారు బ్రాహ్మణులు, మూటలు మోయలేక మోయలేక. అదియట్లుండగా నెవరో శంకరశాస్త్రిగారట. ఈ నాఁడాయన తండ్రితద్దినమగుటవలన రాలేదని యీ-చీరెలు దోవతులు వారికిచ్చిరమ్మని నానెత్తినవేసిరి. అబ్బా యీ యెట్టి మూఁటమోయలేక నామెడలు విఱిగిపోవుచున్నవి. (క్రిందవిడచి) చిన్నప్పటినుండియుఁ దననే నమ్ముకొని యెన్నికష్టములకైన నోర్చి సేవించు నావంటి సేవకున కొక్క కాసయిన నిచ్చుట యున్నఁగష్టముగాని మహారాజుగారికి నిష్కారణముగనింత ద్రవ్యమును బోడబాపలు కొల్లగొట్టి కొనిపోవుట యిష్టమేకాఁబోలు. మంచివారికివి రోజులా? ఉదయాస్తమయములు వంచిన నడుమునెత్తక వేళకాహారము దిన పీలులేక నాకెందుకీ యన్యోయోగము గలిగించితివా భగవంతుఁడా, యని యేమన్న నేనే యదృష్టవంతుఁడననియుఁ దమకిట్టియుద్యోగము దొరికిన బాగుండుననియుఁ గొందఱు కులనాపకులు నాపైఁబడి దుఃఖించెదరు. ఒకరిదగ్గరఁ బొట్టకై సేవజేయుటకన్న నీళ్లులేని ఓవిలోఁబడి చచ్చుటయే మేలని తోఁచుచున్నది. అందుకొఱకే "సేవాశ్వవృత్తిం విదుః" అని పెద్దలుచెప్పిరి. ఆహా! ఎటువంటిదైననేమి తప్పనిచో గౌరవింపవలసినదే? బ్రహ్మదేవుఁడు నానొసట మూఁడుపంక్తులుగా వ్రాసినప్పుడనుభవింపక తీరునా? సీమంతినీదేవి చేయు దంపతీపూజలకై వచ్చుబ్రాహ్మణుల సమ్మర్దమున కూపిరికూడ పోవునేమో యని యీవలఁబడితిని. ఇంతలోనే యీ పాడుమూటయొకటి సంభవించెను. (వినుటనభినయించి) అదుగో అప్పుడే పిలుపుతగిలినది. ఇంకను దంపతిపూజలు జరుగుచునేయున్నట్లున్నది. (చూచి) అదుగో బ్రాహ్మణులు వచ్చుచున్నారు (తెఱలో) వసంతకా! త్వరగారమ్ము.

కంచుకి—ఇదిగో వచ్చితిని. ఈమూటనిందుంచి తరువాత తీసుకొని పోవుదును. (నిష్క్రమించును ఇది యఖండచూళిక) .

(రంగము అరుణాస్పదపుర సమీపారణ్యమున ప్రవేశించి)

మైత్రే-సామదానములచేతఁ బ్రయత్నించినపుడు స్వాధీనముగానివారి విషయమై ముఖ్యముగా భేదదండము లుపయోగింపవలసినదే?

చ॥ కరుణవహించి రాజసుత ♦ కష్టపరంపర కోర్వదంచు ని
ష్కరుణిననన్యదుర్లభుని ♦ గాంతునిఁగూర్చినఁగాని సాధ్వి మ
త్పరిభవకారణంబగు వ్ర ♦ తంబునె గౌరవదృష్టిఁజూచు నా
తరుణి నుపేక్ష సేయక ప ♦ దంపడి వంచనఁజేయకుందునే?

తే. అంధకారతుల్యంబునై ♦ యాకసంబు
నంతవ్యాపించి భయదమా ♦ నంబుదమును
బ్రళయజంఝానిలము భంగ ♦ పఱచునటులఁ
గలికియొనరించు వ్రతము భం ♦ బుఁజేతు.

సుమేధసుఁడు తన శక్తినంతయు నుపయోగించి సోమవంతుని మెప్పించి కృత్రిమ దంపతీవేషమున సీమంతినిని వ్రతభ్రష్టురాలుగఁ జేయఁబోయెను. శతవిధముల నేఁడే యామెచేఁ బూజింపఁబడి రాఁగలఁడు (నిదానించి) కృత్రిమమార్గమున వచ్చిరని యెఱిఁగి సీమంతినీదేవి తన పాతివ్రత్యప్రభావమున సోమవంతుని స్త్రీ యగునట్లు జేయదుగదా? వ్రతప్రభావమన్న నాకు భీతిగలుగదుగాని పాతివ్రత్యమహిమయన్న మొదటి నుండియు నాకెక్కుడు భయము. నాకు జయముగల్గుటెట్లు న్నను సోమవంతుని కొంప కూలదుగదా? పాపమాతఁడు లేకలేక కలిగిన పుత్రుని రెండక్షరములు జెప్పుదునుగదాయని తలఁచి నావద్దనుంచెను. అయ్యో నాధైర్యమెల్ల నిప్పుసెగనున్న నెయ్యివలె పలుచనగుచున్నదే? హా! పతివ్రతాప్రభావము.

హా! వ్రతసామర్థ్యము ఇఁకేమున్నది. అదుగో సోమవంతుఁడు స్త్రీవలెఁ గనుపడుచున్నాడు. (సోమవంతుడు స్త్రీయై పాద గట్టును) హా! హా! అన్యాయము. దుర్భరము. పుత్రశోకము. (పడిపోవును. కొంతవడికి లేచి)

మ॥ కలయో నిక్కనమో ప్రమాదగతమో ♦ గాఢాంధకారంబు లో
పలనున్నానో మతిభ్రమంబో కలుష ♦ వ్యాపార సంజాతమో
ప్రళయాగ్ని ప్రభఁగాల్పగాఁబడితినో ♦ ప్రాణంబులే పోయెనో
తిలకింపంగ నిదేటి సాధ్వసము మై ♦ త్రేయుండ నేగానొకో.

ఎట్టిధైర్యము పాడయ్యెను. (నిదానించి ధైర్యముఁదెచ్చుకొని తనను ద్దేశించి)

ఛీ! మైత్రేయా! ప్రతివాదిహృదయశూలంబగు నీధైర్యమునెల్ల గోల్పోయి పిరికిపందవై యొకయబలకై యిట్లుభీతిల్లెదవా? ఆమె వ్రతనిశ్చలతయు నామె పాతివ్రత్యము నీవెఱుఁగవా? (నిట్టూర్పువిడచి) నాశిష్యులిప్పటి కాశ్రమమునకుఁ జేరియుందు రేమో ముందు వారిని విచారించెదను. (నిష్క్రమించును)

(ఇది చతుర్థాంకము)





శ్రీ మీనాక్ష్యైనమః.

# సీమంతినీ నాటకము.

## పంచమాంకము

(రంగము—అరణ్యము సుమేధసుడు సోమవతియుఁ బ్రవేశింతురు)

సోమ—నాథా! ఆ పతివ్రతారత్నము నేమని పొగడవలయును! ఆ దంపతీపూజ చేయునప్పటి యేకాగ్రతయుఁ బండిత బహుమానము జేయుతఱి విమర్శనాశక్తియు, బ్రాహ్మణ సంభావన గావించునెడ నుదారతయు నెందైనఁ గంటిమే? వ్రతనిష్ఠగల వారిలో మొదట నామెనే చెప్పవలయును. అట్టిపుణ్యాత్మురాలు భార్యయగుటకుఁ జంద్రాంగదమహారాజెంత యదృష్టవంతుఁడో.

సుమే—(స్వగతము) పాపమీతనికి సీమంతిని వ్రతభ్రష్టురాలయిన విషయము తెలియదు. (ప్రకాశము) ఆమెదాతృత్వమువలన మన దారిద్ర్యము తొలఁగినట్లే. ఆహా! ఆమెభక్తి నేమని చెప్పవలయును? కాని నీవు నన్నింకను నాథాయని పిలుచుచుంటివే ఆ వేడుక తీరలేదా?

సోమ—మనోహరా! కాంతలకుఁ బతులమీఁద నిరంతరము నాచారమై యున్న యీపిలుపున కొకనాటితో విశ్రాంతిగలుగునా?

(ఇరువురు నడచుచుందురు)

సుమే—భక్తిభావమున నిశ్చలచిత్తయై మనను దంపతులుగఁ దలఁచి పూజించు నాసీమంతినీదేవిని గాంచినప్పుడు నాకుఁగలిగిన భయమేమని చెప్పవలయును?

సోమ—నాకట్టిభయ మేమియుఁగలుఁగలేదు. కాని యీసమయమున నామె మనశరీరములందు సువర్ణాకృతలఁజల్లి "ఉమామహేశ్వరాభ్యాంగమ" అని వచించువఱకు నాచైతన్యమెల్ల మారిపోయినట్లైనది.

సుమే—విశేషధనలాభకరమగు నా దంపతీత్వము నేటితో సరిపోవును గాన నిన్నొక్కసారి సంబోధింతునా ?

సోమ—ఒక్కసారియననేల ? మనజన్మాంతమది యేకదా శోభిల్ల వలసినది.

సుమే—(నవ్వుచు)

తే॥ పరిహసించెదవేల లో ♦ భంబుకతన
నాడు వేషంబు వేయించి ♦ నాఁడసీకు
వేలువంచినఁగాక యే ♦ లీలదోఱకు
వెన్నయేవారికైనను ♦ విప్రవర్య.

మనమాచరించిన పని దోషయుక్తమైనను గాలానుగుణ్యముగఁ జేయక తప్పదయ్యెను. ఇఁకఁజాలునుగాని యీ కుటిలవేషము నుపసంహరింపుము. ఆలస్యమగుచున్నది.

సోమ—(స్వగతము) ఈ యమాయకుఁడింకను నన్ను బురుషుఁడనియే భావించుచున్నాఁడు. (ప్రకాశము) జీవితేశ్వరా ! చూచితివా? ఈ యారామశోభను.

చ॥ విరిసిన జాజితీఁగె లవె ♦ వేడుకఁజేయవనున్న శాఖలఁ
గరములఁ గౌగలించి తమ ♦ కంబున నిల్చునుహీంపహాళిచే
బరువడి సత్కరింపఁబడి ♦ భాసిలు బంధురగంధవాహసం
భరితపరాగపాండురను ♦ మప్రకరాన్వితపత్రసంహతిఁ.

సుమే—(స్వగతము) ఈతఁడు సర్వశాస్త్రపరిజ్ఞాతయయ్యు నవసర ప్రాప్తమగు స్త్రీరూపము నిత్యమనికాఁబోలు నిట్లు మాట్లాడు చున్నాఁడు. (ప్రకాశము) సోమవంతా! ఏటికీబోఁటులకుఁ దగిన బూటకపుమాటలు. తొలుత నధర్మంబు త్యాజ్యమని చెప్పిన నీకీపరిహాసవాక్యములు రుచించెనా?

సోమ—ఇందు నాదోషమేమికలదు. అదృశ్యుఁడై విషగర్భితములగు వాడికోలలచేత మనోభవుఁడిట్లు జేయుచున్నాఁడు. నాపైఁ గినిసెదవేల? నీవే నన్నాదరము గావించిన నాకిఁక లోక ములో దిక్కెవరు?

ఉత్సాహవృత్తము

కాంత! యీ వసంతమెంతొ ♦ కన్గొనన్ వెలింగెడిన్
సంతసంబుతోడఁగూయు ♦ శారికల్ బికంబులన్

సుమే—ఇంతిపోలె నిట్లుబల్క ♦ నేల నీకు మిత్రమా!
భ్రాంతిపీడి కాంతరూపుఁ ♦ బాయు మా టెఱుఁగుమా?

సోమ—అయ్యో నాపైనింతనిర్దయ యెందులకు?

పంచచామరము.

మనోహరా! యిదేటిమాట ♦ మారుఁడంపకోలలన్
మనంబు నాటనేయుచుండ ♦ మాన్పరావదేలరా!

సుమే—అనారతంబు నీకు మూర్ఖ ♦ నట్లు బల్కఁబాడియే
నృనాయకుల్ గనన్ గరంబు ♦ హీనులంచునవ్వరే?

సోమ—నాథా! వలపునిలుపలేక నీదరిజేరినకాంతనిట్లు బల్కఁదగునా?

ఉ॥ "పుట్టిననాటనుండి యొక ♦ పొత్తుననే భుజియించినార మొ
ప్పట్టున నొక్కరొక్క రెడఁ ♦ బాయక విద్యలనేర్చినారమం
చెట్టిటొ శాస్త్రదూష్యమని ♦ యెంచక కృత్రిమరూపమూని నే
నట్టె లతాంగినైతి నపు ♦ డా సతి దంపతిపూజసేయుటన్.

సుమే—సోమవంతా! కర్ణకఠోరములగు నీపలుకులువిన్న నామనంబు వ్రక్కలగుచున్నది. ఇంకనైనను నామాటవిని యెందైనం బోవుటకు సమ్మతింపవా? నాతప్పు క్షమింపవా?

సోమ—మనోహరా! "పిల్లికి జెల్లాటము ఎలుకకుం బ్రాణసంకట మన్నట్లు మోహపాశబద్ధములైనా ప్రాణంబు లెగిరిపోవుచుండ నన్నెందులకీ కఠినవాక్కులచేం దపింపంజేయుదువు. దయ యుంచుము. (సమీపించును)

సుమే—(కోపముతో) నేనెన్నివిధములవేడినను వినకున్నావు. ఇంక నీయిష్టము. నాదారి నేబోయెదను. (పోబోవును)

సోమ—(చేయిబట్టుకొని) నాథా! ఇదేటిన్యాయము. సమస్త మనీషి తల్లజులయెదుట వృద్ధసువాసినీ సమాజము సన్నిధి నుమా మహేశ్వరులసాక్షిగ నన్నాసాధ్వీమణి నీభార్యగ భావించెం గదా. అట్టి నీసహధర్మిణి నెందుంబోవిడతువు. నీకన్న నాకు దిక్కెవరు. నన్నుమన్నింపుము.

సుమే—(తనలో) కట్టా! ఈతని కరగ్రహణమాత్రమునం బ్రౌఢాంగనా పాణిగ్రహణమునంబోలె శరీరమెల్లం గగుర్పొడచినదేమి? పామరులకువలె హృదయము నూతన వికారావృతమైనదెందు లకు? ఈ బాష్పధార యెక్కడిది? మోహాంతయుం జెమట పట్టినదే? మాకౌటిల్యము నెఱింగి సీమంతినీసాధ్వి నిశ్చల చిత్తయై తన వ్రతము భంగముగాకుండుకొఱకు మమ్ము దంపతులగున ట్లాశీర్వదించెనా యేమి? అయ్యో మైత్రేయా అన్యాయముగ మాకొంపంగూల్చితివే? నేనప్పుడేభయపడితిని. ఈపరాభవాగ్నిం జల్లార్చువారెవరు? నీపలుకులు వేదోక్తము లని భావించితినే? మోసముంజేసితివా? ఆహా! విధివిలసితము.

సీ॥ గ్రహచారమా! యింత ♦ కాఠిన్యమున్నాల్ప
నే పాపమొనరించి ♦ యెఱుఁగుదమ్మ
దురదృష్టమా! యిట్టి ♦ దొసఁగుఁగల్పింపఁగా
బాడియే బ్రాహ్మణ ♦ బాలురందుఁ
గాలమా! యీరీతి ♦ గామాంధఫలించి
యేధనంబార్జింప ♦ నెంచితీవు
లోభమా! నీదృష్టి ♦ లో మమ్మొచేర్చితి
వీజగంబది శూన్య ♦ మే తలంప

తే॥ కటకటా లేమిబాధచేఁ ♦ గాలమొక్క
రీతిఁగడుపఁగదలఁచి ప్ర ♦ ఖ్యాతకీర్తిఁ
బడయఁగల విప్రపుత్రుని ♦ బడఁతిఁజేసి
పారనైచితె దైవమా ♦ పాపబుద్ధి.

సోమ—నాధా! ధైర్యమువహింపుఁడు.

తే॥ అయినదానికిఁ జింతింప ♦ నగునెఫలము
జరుగఁబోయెడి కార్యంబు ♦ నరయుమయ్యా
సకలశాస్త్రంబు లెఱిఁగిన ♦ చతురమతివి
తెలియరానట్టి ధర్మముల్ ♦ గలవెనీకు.

సుమే—ఆహా! ఎక్కడనో పదిరూకలఁ దెచ్చుకొనవలయునని తలఁచు మనకెట్టి యిక్కట్లుగలిగెను.

సోమ—దైవప్రభావమునకన్నఁ బతివ్రతామాహాత్మ్యమధికముగదా? అందుచేతను వ్రతనియతయగుఁ గాంతచే నియమింపఁబడిన యీ స్త్రీత్వమునుగూర్చి చింతించిన ఫలమేమి? నాయదృష్ట మిట్లున్నది.

సుమే—అయ్యో అట్లని యూరకుండఁగలమా?

చ॥ వినియెడిశక్తి లేని శత ♦ వృద్ధు భవత్పిత కండ్లు గానరా
మిని నినె మాటిమాటికిని ♦ మెల్లనఁ బిల్చుచుఁ బ్రాణపంచకం
బునిచి చరించు నీయెడల ♦ నొక్కఁడవీవు సుతుండ వమ్మహా
త్మునకతఁడీ మహావిలయ ♦ ముఁ గని నన్ను శపింపకుండునే ?

చ॥ వలవ దధర్మకార్యమని ♦ వారణఁ జేయుచునున్నగాని నీ
పలుకలఁ జేసి యిట్లు ధన ♦ వాంఛనొనర్చితిఁ బాపకార్యమా
ఫలముభుజింప నీవె యయి ♦ పాయనిచింతల నొంద నైతివో
యలఘుచరిత్ర నాకలుష ♦ మారగ నన్ను వధింపుమాయిఁకన్.

(సోమవతి పాదములఁబడును)

సోమ—(లేవనెత్తి) నాపాపము నేటికిట్లు ఫలించినది. ఇందు నీదోష మేమి ? చిన్ననాటనుండియు మనమిరువుర మొకటియై చరించి నందులకు మెచ్చి పరమేశ్వరుఁడీ నెపమున నిఁక మీదను నట్లే యుండుఁడని నియమించెను. కావున నొండనక నన్ను మన్నింపుము.

సుమే—(ధైర్యముదాల్చి) నీయభిప్రాయ మెఱిఁగితిని. మనము నీమంతినీసవిధమునకఱిగి యామె నియమించినట్లొనర్తము.

సోమ—మన కామెదర్శన మెట్లులభింపఁగలుగును. ఈ మొగముతో నా మెకడ కేగుట మంచిదనియా. మనగురువగు మైత్రేయుని కడకుఁబోయి యాసమర్థుఁడొనరించునట్లు జేయుదము.

సుమే—పోదము రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు)

(రంగము యమునాతీరారామము)

(చంద్రాంగదుఁడు సీమంతిని గౌతముఁడు ప్రవేశింతురు)

చంద్రా—(గౌతమునిజూచి) మిత్రమా !

మ॥ ఒక కార్యంబుఁ దలంచి వచ్చితిని వే ♦ రొక్కండు ప్రాప్తించె నా
కిఁక ముందేగతి సంభవింపఁగలదో ♦ యేఁతినూహింపనౌ

సకలాంభోధిపరీత భూవలయ ర ♦ క్షాదక్షుండై నట్టి బ్ర
హ్మాకు భిన్నంబుగ సంచరింపఁగల సా ♦ మర్థ్యంబ దేవారికో.

అఘటనఘటనా ; సమర్థుఁడగుఁ బరమేశ్వరుని కృత్యంబులు వింతలుగదా! క్షణక్షణంబున కనేకవిధంబుల నీలోకజాలమును మార్చు సంకల్ప మాతనికెందులకో.

గౌత—ఆతఁడును మనవంటివాఁడే. అయితే ఆతనిసంకల్పము వ్యర్థముగాదు. మనసంకల్పము సార్థకముగాదు. ఇంతే భేదము. కాని తెలియకడిగెదను. మనవలెనే యాతనికిఁ గూడ భార్యాపుత్రులు నిల్లువాకిలియుఁ గలదా?

చంద్రా—లేకేమి. ఆపరాత్పరునకుఁ బ్రకృతియే భార్య. సమస్త భూతములు పుత్రులు. లోకమే యిల్లు.

గౌత—అట్లు జెప్పుము. ఇంతవఱకు నే ననుకొను టేమంటే ఆదిగంబరికన్న నేనే మేలనియు నిప్పుడప్పుడే నాకు వివాహ విషయమై తొందరయేలననియు? ఏమీ చెప్పవూ? అయితే నావిషయము చూడవలయునన్నమాటే?

సీమ—మనోహరా! మీకెప్పుడును గౌతముని మంచిచెడ్డలు విచారించుటకు సమయము 'చిక్కదేల. పాప మాతఁడు మీకు మిత్రుఁడుగదా?

చంద్రా—(పరిహాసముగా) అవును పాప మాబ్రాహ్మణుని యోగక్షేమము లీనడుమ విచారించుటలేదు. (గౌతముని జూచి) గౌతమా! నీకు భోజనము చక్కఁగా జరుగుచున్నది గదా?

సీమ—(గౌతముని జూచి) నీకు వలసినంత మాసత్రములో దినుచుండుము. నిన్నెవరు నాటంకము జేయరు.

గౌత—ఇంత కాలము మిమ్మాశ్రయించుకొన్నందులకు భోజన వసతియైన నిరాటంకముగా జరుగునట్లు జేసితిరి. ఇంతకన్న నాకేమి

గావలయును? ఒక్క విషయము మిమ్మడిగెదను. సమాధానము నిత్తురా?

చంద్రా—అవశ్యము. అడుగుము.

గౌత—ఇట్టి సమయములో మీహృదయ మెట్లుండునో తెలియఁ గోరెదను?

చంద్రా—

ఉ॥ క్రొత్తఁగఁ బెండ్లియైన సతిఁ ♦ గూడి మహావిభవంబునన్ మదా
యత్త సమస్తవైభవుఁడ ♦ నై చరియించెడి నిన్నుఁగూడి యే
యుత్తలపాటులేకయె సు ♦ ఖోదధివీచుల నోలలాడు నా
చిత్తముజెందు సౌఖ్యమును ♦ జెప్పఁగ నేగతి నేర్తుమిత్రుఁడా!

గౌత—నిజమే. అనిర్వాచ్యమగు బ్రహ్మానందము నొందుచుంటివి కనుక నీకు లోకముపై దృష్టిలేదు.

సీను—నాథా! ఆబ్రహ్మచారి మాట లెప్పుడు నున్నవియే కాని చిరకాలమునుండియు రసజ్ఞులగు మీతోఁ బడవనెక్కి యమునానదిపై విహరింపవలయునని కోరిక గలిగియుంటిని. దానినిప్పుడు నెరవేర్పరా?

చంద్రా—దేవీ! నీవు కోరఁదగిన వస్తువులెన్నియోయుండ యట్టి కోరికఁ గోరఁదగునా?

మ॥ లలితోద్యానములందు స్వైరగతి ను ♦ ల్లాసంబు దీపింపఁ గాం
తలతోడన్ విహరించుటో, కనక సౌ ♦ ధప్రాంతకాసార పం
క్తులలో నాథుటో యర్హమయ్యెడును నీ ♦ కున్ భీకరంబౌతిమిం
గిలసంతానముచేత నొప్పుయమునన్ ♦ గ్రీడించుటల్ జెల్లునే.

భయంకరమగు యమునానదిపై విహరించుట నీవంటికోమలాంగులకుఁ జెల్లదు తరుణీ! ఇప్పటికి నన్ను మన్నింపుము.

సీమ—మనోహరా! నామనోరథముఁ దీర్పదగు బాధ్యతకల మీరే నిరాకరించిన నావాంఛ యెట్లుదీరఁగలదు. నాప్రాణపదమగు మీయండనుండు నప్పుడు నాకేమి భయము.

చంద్రా—(స్వగతము) ఈయువతి యభిలాష నిప్పట్లదిరస్కరించుటుచితముగాదు. (ప్రకాశము) దేవీ! అట్లేకానిమ్ము. నీకానందము కలిగించుటకన్న నాకావశ్యకమేమి యుండును.

గౌత—(భయమున) అయ్యో! అయ్యో! ఇదేటికోరిక దిక్కులు బ్రద్దలగునట్లు మ్రోఁతలిడుచుఁ జూచుటకును భీకరమగు యమునానదిమీఁదనా విహారము సల్పుట. పాముతోఁజెల్లాటము తగునే మహారాజా! సర్వజ్ఞుఁడవు నీకైనఁ దెలియదా?

సీమ—గౌతమయ్యా! నీకీ పుల్లవిరుపు మాటలెందుకు? నీవూరకుండుము.

గౌత—మీకుఁ గోపముగల్గిన నట్లేయుందును గాని నన్నుమాత్రముఁ బిలువకుఁడు. నాకుఁ జిన్నప్పటినుండియు నీరన్నఁజాలభయము. గ్రహచారము చాలక జారిపడుదునేమో?

చంద్రా—గౌతమా! నీకీ యవాచ్యములఁ బల్కనేల? ఈయబలకు లేని భయము నీకా కలుగును?

గౌత—(స్వగతము) ఈతఁడెప్పుడును నిట్లేబల్కి నాకొంపఁ గూల్చుచుండును. ఎన్నియోసారు లీతనిమాట వినఁగూడదని యెంచుటయు వెంటనే శిరసావహించుటయు సంభవించుచున్నది. కానిమ్ము. పదిమందితోఁ చావు పెండ్లితో సమానము. నేను వలదన్నమాత్రమున నాగునా? (ప్రకాశము) అయ్యా మీ యిష్టము. ఏమైనను జేయుఁడు.

చంద్రా—గౌతమా! నీకేమియు భయములేదుగాని పడవవానితోఁ జెప్పిరమ్ము పొమ్ము.

గౌత—(స్వగతము) అచ్చి పెండ్లి బుచ్చి చావునకన్నట్లు లీయమునా విహారము నాదుంపతెగుటకేవచ్చినది. (నిష్క్రమించును)

చంద్రా—దేవీ ! ఈతఁడు మిక్కిలి భయస్తుఁడు. ప్రమాదమున నేవి యేని పలికినఁ గోపింపకుము.

సీమ—నాథా ! చంద్రునకిష్టుఁడగు వసంతునిపైఁ జంద్రికకు నేగియా ? హాస్యప్రాయుఁడు గావున పరిహాసమున కేమైనఁ బలుకుదును.

చంద్రా—మనము గౌతముఁడువచ్చువఱకీ వనమున విహరింతమురమ్ము.

(ఇరువురుఁ బ్రవేశము నటింతురు)

సీమ—ఈ వసంతశోభను గాంచితిరా ? ఎంతసంతసముఁ గూర్చుచున్నదో ? ఒకప్పుడిదియే పీడాకరముగానుండును.

చంద్రా—బాగుగాఁబలికితివి.

తే॥ రసనమునకు మఱెంత సంత ♦ సముఁగూర్చుఁ
బంచదారయె యొకవేళఁ ♦ బైత్యదోష
నిహతుఁడై యున్న యాతని ♦ కహహ చేదు
గాక రుచియింపఁగలదె జ ♦ గంబునందు.

సీమ—చక్కఁగా సమర్థించితిరి. ఇటుజూడుఁడు.

మత్తకోకిల

భూమినాయక ! యీవనస్థలి ♦ [illegible]బులఁ గాంచితే
కోమలంబగుఁ దీవెరాజి[illegible] [illegible]నొప్పెడుఁ

చంద్రా—కామినీ ! [illegible]
నా[illegible]

సరసిజవృత్తము

ఆనందంబౌ నల్లదె కంటే ♦ నలజలదమువలె నలరెడినితమా
లా నీకంబుల్ గన్గొని యెంతో ♦ యఱవిరసిన కనులపుడు దెఱచిమే
లౌ నాట్యంబుల్ సల్పెడు నెమ్మల్ ♦ హరిదళసదృశములగుc గనులcగనక్
జానై మానై రాజై యొప్పున్ ♦ సరసహృదయ జలజముధరణివరా।

చంద్రా—కాంతా! ఈ వికసించిన సుందరారవిందములపై మధుకరములెట్లు మూcగినవో చూడుము. ధనవంతులకడకు యాచకులిట్లేగదా వత్తురు.

సీమ—మనోహరా! యమునాతరంగ శీకరములcగొని మెల్లమెల్లcగ వచ్చు నామలయకుమారుcడెంత హాయినిc గూర్చుచున్నాcడో చూడుcడు.

చంద్రా—ఆ. మఱచితిని. గౌతముcడు పడనవానికడకుcబోయి చాల తడవైనది. ఇంకను రాలేదేమి కారణము.

గౌత—(ప్రవేశించి) కారణమేమైయుండును. పోయివచ్చు వ్యవధియైన నుండవలదా?

సీమ—చంద్రా (గౌతమునిజూచి నవ్వుదురు)

గౌత—అదియే మీరుచేయవలసినపని. వీcడు మీయానతిచొప్పున నెక్కడికంపి... [illegible] లc బరుగెత్తుచుండుననియా నవ్వుచుంటి... [illegible]

చంద్రా... [illegible] ...చ్చితివిగనుక గౌత... [illegible] ...తిమి.

( రంగము. యమునానది పడవఱ్ఱో( బడవవాండ్రు ప్రవేశింతురు. )

మొదటి—అరే మల్లిగో తాడేస్కో తాడేస్కో.

రెండ—బలెచంగతిలే. నీకేంసెప్పేవ్ దారి పసిందులేద్ తెఱచా పెత్తాలిసిందే.

మూ(డ—ఓరిస్సన్నోయ్. పడవొడ్డట్టేటా. వాలుపడవ.

మొద—అరెమల్లిగా ఆనిక్కచాపెద్దాం తాడేస్కో-ఈరేవుకాడాపాలె.

( నలుగురు బొటలుబొడుచు లాగుచుందురు. )

( తరువాత చంద్రాంగద సీమంతినీ గౌతములు ప్రవేశింతురు. )

గౌత—ఓరీ! సరంగూ! పడవనాపుము. మహారాజుగారు వచ్చియున్నారు

సరంగు—ఓ ఉండయ్యా. పడవొడ్డట్టేం. ఆరేవుకాడే పేంరాండి.

( మెల్లగా నాపుదురు. )

చంద్రా—( నదిని సమీపించి ) దేవీ! చూడుమీ మహానదిని.

మ॥ ప్రళయాభీలమహాంబుద ప్రకరశుం ♦ భధ్వానకృద్భంగ సం
కలితంబీనదియొప్పెడున్ సకలలో ♦ క ప్రాప్తమా దుష్కృతా
చల సంతానము భిన్నమై చనెడు భా ♦ స్వత్కీ కరానీకమన్
గులిశంబంగ తలంబుసోకననుచున్ ♦ ఘోషిల్లునాని త్తరిన్ .

గౌత—రాజా! త్వరగా( బడవలోనికెక్కుడు గాలి చక్క(గా వీ(చుచున్నది.

చంద్రా—తరుణీ! పాపనాశనియగు నీ యమునానదికి నమస్కరించి పడవలోనికెక్కుము.

సీమ—(నమస్కరించి ఎక్కును)

చంద్రా—తల్లీ! నానేరమిసైచి రక్షింపుము. (ఎక్కును)

గౌత—మహారాజా! నేనీయేటియొడ్డున సంధ్యావందనము( జేసికొనుచుందును. మెల్ల(గా వెళ్ళిరండు.

సీమ—ఇప్పుడెక్కడి సంధ్యావందనము. చాలప్రొద్దున్నదే?

గౌత——మీకేమి ? చెప్పుదురు. ఈ నడుమ మీ పెండ్లిసందడిలో వారమురోజుల సంధ్య మిగిలినది. అదియంతయుఁగావలయునా? వద్దా ?

సీమ——పడవలోఁ గూర్చుండి సంధ్యావందనముఁ జేయవచ్చునుగాని త్వరగారమ్ము.

గౌత——(స్వగతము) ఎట్లుతప్పించుకొందమన్నను దప్పునట్లులేదే ? అయ్యో గ్రహచారమా ! నన్నుబాధించుటకు సమయము దొఱకెగదాయుని బ్రహ్మహత్యకొడిగట్టుకుము. నీకు శాంతి జేయింతును. (ప్రకాశము) సరంగూ ! పడవను గట్టిగా బట్టుకొనుము. (ఎక్కును)

సీమ——నాథా ! నేటికిగదా నాకోరికతీరినది.

చంద్రా——ఎప్పటికేది ప్రాప్తించునో యెవరెఱుఁగుదురు. అటు జూడుము ఆనదిమీఁద

ఉ॥ చక్కనిగాలి వీవఁ దెఱ ♦ చాపయె సాయముగాఁగ లాగఁగా
నక్కరలేక యే జను మ ♦ హాత్వరితంబుగ నీకలంబహో
యెక్కువదారముల్ విడువ ♦ నేగెడి గాలిపటంబుబోలె నో
కొక్కవిధంబునల్ దరువు ♦ లొడ్డున గన్పడుచుండు నట్లుగాల్.

మఱియును——

ఆ॥ అతిభయంకరంబు ♦ లైన పాఠీనంబు
లొక్క దానిమీఁద ♦ నొకటిపడుచు
నీటిజాలువలన ♦ నేటిపైఁబారుచుఁ
గానవచ్చు వానిఁ ♦ గంటె తరుణీ !

గౌత——అయ్యో ! ఆ తిమింగిలమును జూడుము. మన నగరి పడమర వాకిలివలె నోరుదెఱచుకొని వచ్చుచున్నది. పడవను మ్రింగునేమో ?

సీమ—(స్వగతము) ఈ బ్రహ్మచారి నోటనుండివచ్చు వాక్యములెల్ల నమంగళకరములే?

మొద—అరెమల్లిగో మాగాలేత్తాంది సెఅబాప సించి తెక్జోగ్గా.

రెండ—అరెయిస్సన్నోయ్ సుడిగాలిరో బాబో. ఇయ్యాలెవ నేళ్ళెగం బాగొండలేదురో కొడ్గో.

మూండ—పడవలోకి నీళ్లెక్కొ తోడాయ్ తోడేయ్.

చంద్రా—రానురాను గాలి విపరీతముగా మారుచున్నది. ప్రమాదము సంభవించదుగదా?

గౌత—(స్వగతము) నేను వలదని చెప్పినకొలందిని వినక యీమెదాని మాటవిని వచ్చినందుల కిదియే శిక్ష "స్త్రీబుద్ధి ప్రళయాంతక" అన్నారు సామాన్యమా? (ప్రకాశము) ఎవ్వరైనా నట్టేటిలో విహరించే వారున్నారా? ఈవేళనేదియోకాగలదు. మనము వర్జములో బయలుదేరినాము. ఈగాలికిఁ బడవనిలచి మనము కొంపజేరియునా? బుద్ధిఃకర్మానుసారిణీ.

సీమ—గౌతమా! నీకీయధిక ప్రసంగ మెందుకయ్యా?

గౌత—నాకేమిలెండు మీతోఁబాటు నేనును.

చంద్రా—దేవీ! నీకీ తెలివి తక్కువవానితో నేమిపని వానిమాటలు పాటింపకుము.

గౌత—(స్వగతము) "ఈపాడు ప్రయాణము వద్దయ్యా, యని నెత్తిన నోరుబెట్టుకొని యఱచిన నేను తెలివితక్కువవాఁడనఁట. భార్య మాటవిని యింతఁజేసిన తాను తెలివికలవాఁడఁట. ఎవరు జేసిన పనివారికి బాగుగనే యుండును. వారము రోజులైనను గాలేదు పెండ్లియయి, అప్పుడే యింతయనురాగము ఇంతయైక్యమునా? పుట్టినప్పటినుండి వెన్నంటియున్న నామీఁద నింతనిర్లక్ష్యమా!

ముందువచ్చిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములే యధిక మన్నట్లున్న దే?

చంద్రా—దేవీ! ఇఁక ఁబడవ స్వాధీనమగునట్టులేదు. ఎట్లుగిరగిరఁ దిరుగుచున్నదో చూడుము.

గౌత—అయ్యో పడవమునిఁగి పోవునేమో? ఇఁక నాకు గతియేది? నేటితో నా పేరుమాయును గాఁబోలును. ఈపాడుప్రయాణమువలనఁ గడుపార భోజనమైనను జేయలేదు. అకటా నైషధమా! ఇంక నాకు నీదర్శనముగలుగదా? ఓయింద్రసేన మహారాజా! నీదయా పాత్రమగు గౌతముని గోలుపోదువా? ఓభూదేవీ! నీకు నేనేభారమైతినా! హా! తల్లీ నాకై శోకించు నీకు దిక్కెవరు? (ఏడ్చును)

సీమ—నాథా! పడవమునుఁగుచున్నది. మునుగుచున్నది.

చంద్రా—భయపడకుము. (కౌగలించుకొనును.)

పడ—దొరో యెంత సేసినా మాటదక్కేట్టులేదు.

గౌత—హా! మునుఁగుచున్నది. చస్తిని. చస్తిని.

(పడవ మునుగును తెలపడును.)

(తరువాత సీమంతిని గౌతముడు ప్రవేశింతురు.)

గౌత—అబ్బా, ఎంతగండ మెంతగండము.

సీమ—(దుఃఖముతో) హా! నాథా! హా మనోహరా! నీ ధర్మపత్నినగు నన్ను విడనాడి యెందుఁబోయితివి? నన్నుగూడఁ గొనిపోగూడదా? నిమిషమైనను నిన్ను విడనాడి యుండనోపనని పల్కితివే? ఈదీర్ఘవియోగ మెట్లుసహింతును? అయ్యో! అప్పుడే నీకు నూరేండ్లు నిండెనా? ఈయనాథ కేమిజెప్పితివి? దురదృష్టమా

యెంతపనిఁ జేసితివి? నీకు నేనేగనుబడితినా? నాజీవితేశ్వరు నెత్తుకొనిపోతివా? నాప్రాణపదము నేటఁగలిపితివా? ఆదయామయుని మాయము జేసితివా? ఆశాంతమూర్తిని జూపగూడదా? నాయందునీకిట్టి కాఠిన్యమేల? నీకేమి పాపముజేసితిని? ఈవియోగము సహింపఁగలనా? నన్నుఁగూడజంపరాదా? నానాథుని సాన్నిధ్యము నిత్యమని తలంచితినే? మైత్రేయివాక్యము నిజమని యెంచితినే? సోమేశ్వరుఁడు రక్షించునని సంతోషించితినే? హా! సోమనాథప్రతిమా! నీవైన నీయాపదకడ్డుపడనైతివా? హా! హృదయేశ్వరా ఈదుఃఖము భరింపఁగలనా? నాకడుపు దహించుకొని పోవుచున్నది. నాయదృష్టదేవత తొలఁగినది? ఇఁకనేను బ్రతుకఁజాల! నాకుదారిజూపి నన్నురక్షింపుము. అకటా తలిదండ్రులారా? మీకడుపున నిట్టి నిర్భాగ్యురాలుఁ బుట్టుటకేమి పాతకముజేసితిరి నాగతికెట్లు చింతింతురో? నాయంబాశివుఁడు. నామనోహరునికడకు నన్నుజేర్పుఁడు. మీ సంతోషము పాడయ్యెనా! మీ తలంపులు వ్యర్థమయ్యెనా? (మూర్ఛ పడును.)

గౌత—అయ్యో! చంద్రాంగదా! నీకీపాడుమృత్యు వెక్కడనుండి దాపరించెను. మీ తల్లిదండ్రులకేమని జెప్పుదును. నీస్నేహము నిత్యమని యెంచితినే? అకటా నన్నువీడిపోతివా?

సీమం—(మెల్లగలేచి) అయ్యో గౌతమా! ఎంతపనిజరిగెను.

మ॥ నిమిషంబేని యెవానిఁబాయుటన నేం ♦ తేనీ జగంబెల్లశూ
న్యముగా నెంతునో యట్టిప్రాణపతి నా ♦ హా బాసి వైధవ్యదుః
ఖము నేరీతిభరింపనేతుర్గ శిరముల్ ♦ ఖండింప శేషించి నిం
ద్యమునైగన్పడు యెుండెముల్ బలెనస ♦ హ్యంబైన దుఃఖంబుతో.

గౌత—అమ్మా దుఃఖించినఁ బ్రయోజనమేమి? మన దురదృష్టము యమునా విహారము రూపమునఁ గొంపకూల్చినది.

తే॥ ఆనళినసేత్రు నంతటి ♦ వానికైనఁ
దప్పునే పూర్వజన్మార్జి ♦ తమగు ఫలము
ననుభవింపక యెంత యే ♦ డ్చిననుగాని
తగిన ప్రతికృతిసేయక ♦ ధరణిలోన.

దైవయోగమువలనఁ గలిగిన నీయాపద కేదియేని ప్రతీకారము జేయవలయును. కావున నాలసింపక నగరమునకరిగి మీతండ్రి గారితోఁ జెప్పుదమురమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.



74



శ్రీ ఖీనాత్మనేనమః

# సీమంతినీ నాటకము

## షష్ఠాంకము.

( పాతాళలోకము, చంద్రాంగదుడు ప్రవేశించి. )

లోకమంతయుఁ బ్రశాంతమై కానవచ్చుచున్నది. దిక్కులు నిర్మలములై యున్నవి. ఇది రాత్రియో పగలో తెలియుటలేదు. సకలచరాచరప్రపంచ నిర్మాతయగుఁ బరమేశ్వరునిలీలలనిర్వాచ్యములు నగోచరములునుగదా? నేనెక్కడనుండి యెక్కడికేగుచుంటినో? ఇది యేభూపాలుని రాజధానియో యడుగుదమన్న నొక్కమనుష్యుఁడును గానరాఁడే? వికసిత వివిధకుసుమసుగంధభారమందగమనుఁడై మలయపవమానుఁడు మాత్రము హాయినిఁ గూర్చుచున్నాఁడు. పరిశీలింపగానిది మనుష్యలోకముగానట్లుతోఁచుచున్నది. స్వర్గమగునా? కావచ్చును అయినచో నిరంతరప్రవాహయైసకలపాపనివారిణియగు భాగీరథియేది? కానవచ్చుటలేదే? సమస్తాభీష్టప్రదంబులగుఁ జింతామణీ కామధేనువు లేవంకను గానరావేమి? నందనోద్యానవనమెచ్చట? మహర్షుల యాశ్రమపదంబులేవి? కాదు కాదు. ఇది మనుష్యలోకమున నేదియో యొక యదృష్టపూర్వమగు రాజ్యముగాఁబోలు? ఇంకను గొంత దూరమేగి చూచెదను. ( నడచి చూచి ఆశ్చర్యమున ) ఓహో ఇది భూలోకముగాదాయేమి? ఈకుడ్యజాలములందు మహోరగప్రతిమలఁజిత్రింపఁబడియున్నవే? ఆసౌధాగ్రలంబమానపన్నగ

నికేతనంబులేమి? అందందుఁ దెల్లని సట్టుకుచ్చులవలెమెఱయుఁ గుబుసంబు లెక్కడివి? అవిగో వినవచ్చుచున్నవి. పరస్పరవిహార లోలతఁ జెలరేగి క్రీడించుఁ బన్నగమిథునంబుల సంగీతధ్వనులు గాబోలు. ఇవిగో కనుబడుచున్నవి. కుటిలగాములైన సర్పములు నడచిన మార్గముగుర్తులు. నిక్కముగానిది పాతాళలోకమె? ఇఁకనైషధప్రాప్తిఁ నాకులేదుగాబోలు? ఇక్కడికి నేనేందులకు వచ్చితినో? అవునవును మఱచితిని. నామనోహరినిఁగూడి యమునపై విహరింపవచ్చితినిగదా? దైవయోగమున నావ మునుఁగుట వలన నీలోకమునకు వచ్చియుందును. క్షణమైన నన్ను విడనాడక మదీయహృదయపద మలంకరించియుండు సీమంతినినాకై యెంత విలపించునోగదా? హా! పరమేశ్వరా!

తే॥ కలికి నెమ్మోముఁగన్న నా ♦ కలియు దప్పి
లేక యమరత్వమొంది యా ♦ లీల సౌఖ్య
వారినిధిఁదేలునాకు ని ♦ వ్వగిది నాగ
లోకవాసంబు గూర్చితి ♦ వే కృపాబ్ధీ.

హా! హతవిధీ! నాయెడల నిట్టియన్యాయమొనర్ప నీకేమి పాపముజేసితిని? నా పంచప్రాణములలో నొకటియగు జీవితేశ్వరినా యెడఁబాపితివి? నీచేసినపని కావధూరత్న మెంత యల్లాడుచున్నదోగదా?

ఉ॥ ఆతళుకారుమోముపస ♦ యాకనుదమ్ములడాలుతీరు నిం
పైతగునామృదూక్తి కుసు ♦ మాయుధశాస్త్రసుఖప్రబోధ మా
వాతెఱకాంతి యానడ సు ♦ వర్ణనిభంబగుదేహవల్లి యా
చాతురి యింక నాకెటుల ♦ సంభవమయ్యెడు నక్కటక్కటా.

అయ్యో నాకిందు భూలోకమునకు మార్గమునుజూపువారెవరు కుటిలగాములైన యీ భుజంగములతో నెట్లుమాట్లాడఁగలను

ఈ విషధరులతోడి సాంగత్యమును భరింపఁగలనా. ఈ భోగవతీ పురంబున నెట్లు నివసింపనేర్తును. ఇట్టి దుస్థితికి బ్రతికాంక మెద్ది. (విచారించి)

మ॥ ఎపుడో యెవ్వనిచేతనో యెటులనో ♦ యేరీతినో చూచుచు
న్నపుడే యంగడినున్న మాంసమటు ల ♦ న్యాయంబుగాఁ బ్రాణముల్
విపులంబైన శరీరముల్ విడచు నీ♦లీలం గదా లోక ము
ల్లపుడుల్ బుట్టుచుఁజచ్చుచుంట నిఁక నే♦ లా నాకు దుఃఖంబులున్.

అయినదానికి విచారించినఁ బ్రయోజనమేమి? ఆ కనుబడువారు నాగకన్యలున్నట్లున్నారు. వారివలన నేదేనిగతిఁ దెలిసికొందును. (నిష్క్రమించును)

(తరువాత కొందరు నాగకన్యలు నాట్యముజేయుచుఁ బ్రవేశింతురు)

చంద్రా—(ప్రవేశించి) కాంతలారా!

నాగకన్యలు—(ఆశ్చర్యమున నిష్క్రమింతురు)

చంద్రా—అకటా వీరినడిగి మార్గము తెలిసికొందునని వచ్చిన నన్ను గాంచి పారిపోవుచున్నారేల? నాయాకారము విపరీతముగఁ దోచెనేమో! కానిమ్ము వెంటఁబోయెదను. ఏమైనను మంచిదే. (నిష్క్రమించును)

(రంగము తక్షకసభ)

(తక్షకుఁడు చంద్రాంగదుఁడు మంత్రి ప్రవేశింతురు)

చంద్రా—(స్వగతము)

మ॥ భళిరే కంటె సమస్తభూతల మహా ♦ భారోద్వహుల్ మాళిమం
డలభాస్వన్మణిరంజితాఖిలదిశాం ♦ తర్లోకసంతానునిన్
దళదిందీవరకాంతిసన్నిభఫణో ♦ ద్యద్దేహునిన్ మోహనుం
దిలవిద్విట్కులనాశకున్ శితధరి ♦ త్రీరక్షకున్ దక్షకున్.

(ప్రకాశము) సకలలోకరక్షకా తక్షకా నమస్కారము.

తక్ష.—(చంద్రాంగదునుద్దేశించి మంత్రితో జనాంతికము) అమాత్యా! ఈతఁడెవరు ? గరుడ గంధర్వ కిన్నర కింపురుష విద్యాధరాది దేవయోనులలో నేజాతివాఁడు ? స్వర్లోకవాసులగు దేవతా పతులకేని బ్రవేశింపనలవిగాని యీ సభాతలంబున కరుదెంచి నిర్భయముగా నన్నేకవచనముతో సంబోధించుచున్నాఁడు ?

మంత్రి—మహారాజా ! ఈతఁడు మనుష్యజాతిలోఁ జేరినవాఁడు రాజవీథిలోఁ దిరుగుచుండఁ గొనివచ్చితిమని నాగకన్యలిప్పుడే చెప్పి వెడలిపోయిరి.

తక్ష.—( స్వగతము ) ఏమీ? ఈతఁడు మనుష్యుఁడా? మనుష్యులలోఁ గూడ సశరీరులై పరలోకమునకును వచ్చువారుఁగలరా?(చంద్రాంగదునిజూచి ) ఓయీ ! నీవెవఁడవు? ఈలోకమునకేలవచ్చితివి?

చంద్రా—(స్వగతము) నవాంబుద స్తనితమువలె గంభీరమగు నీతనికంఠనాదము ప్రథమమున నే విపరీతముగఁ దోఁచుచున్నదేమి? ఇంద్రాది దేవతలవలె మర్యాదజ్ఞుఁడుగాఁడా యేమి. "భవితవ్యంభవత్యేవ" అనిగదా చెప్పుదురు. ( ప్రకాశము )

మ॥ కలఁడుర్వీభరణక్షముండు నలభూ ♦ కాంతుఁడు సర్వావనీం
ద్రులలో నొక్కరుఁడమ్మహాత్మునకుఁ బౌ ♦ త్రుండఁగా సమస్తారిరా
డ్బల సంహారకుఁడింద్రసేన ధరణీ ♦ పాలుండు మాతండ్రి ని
శ్చలతఁగా నై షధమేలుకొండు నెపుడుఁగా ♦ జంద్రాంగదాభిఖ్యుఁడఁగా.

నిఖిల సురాసుర చారణ గంధర్వ ప్రస్తూయమానుండవగు నో మహాత్మా ! నూతనోద్వాహుఁడనై యమునానదీ విహార వాంఛ సమిత్ర కళత్రంబుగ నరుగుదెంచి దైవయోగంబునఁ బడవమునుఁగుటచే నిందుఁబ్రవేశించి శరణాగతరక్షకుఁడవగు నీదివ్య తేజముఁ గాంచఁగలిగితిని.

తక్ష.—(స్వగతము) ఏమీ వీనిచాతుర్యము? భయమన్నమాటలేక భీకరాకారుఁడనగు నాయెదుర తన యపూర్వచరిత్రము సతిశ

మోక్తిగా వర్ణించుచున్నాఁడు ? (ప్రకాశముగా కోపముతో)

ఉ॥ నీవు మనుష్యమాత్రుఁడవు ♦ నీ కుల గోత్రములెవ్వియన్న సం
భావనఁజేసి పాపములఁ ♦ బల్కెద వేటికి సిగ్గులేక యూ
రా వసుధాతలంబనుదు ♦ నారసినాఁడవె యీ రసాతలిం
గావరమెక్కనే కనలు ♦ గన్నడవే ఫణినాథు గోష్ఠిలో.

చంద్రా—(స్వగతము) ఈతఁడూరక నేమొ తన క్రూరస్వభావమును జూపుచున్నాఁడు ? ఇఁక నితని శాంతచిత్తునిజేయుటెట్లో తోఁచదు. (ప్రకాశము) పాతాళలోకేశ్వరా ! నిర్మల స్వాంతుఁడవగు నీకీ నిరపరాధిపైఁ గోపమేటికి ? మీరడిగిన యాథార్థ్యము నెఱిఁగించితిని గాని యితరుల దూషించితినే ?

తక్ష—ఓరీ ! మనుష్యమాత్రులగు నీపూర్వుల నెక్కువగా నాప్రేమలఁ జెప్పుట మమ్ము దూషించుటగాదా ? చాలు నోరుగట్టిపెట్టుకొనుము. నాయాజ్ఞ లేక బ్రహ్మాదులకేనిఁ బ్రవేశింపరాని యీ లోకమున. కరుదెంచి మీఁదుమిక్కిలి నోటికివచ్చినట్లు వాగెదవుగా.

చంద్రా—అయ్యా ! నేనిప్పటికి రాఁదలఁచివచ్చినచో మీయాజ్ఞ యవసరముగాని దురదృష్టమున వచ్చినదాని కాజ్ఞయేల ? స్వజాతిశూన్యమగు నీలోకమునఁ బడినందులకుఁ జింతిల్లు నన్నేలఁ గఠినోక్తులచేఁ దూలనాడెదరు ?

తక్ష—ఛీ ! నరాధమా ! నిరంతర ధనలోభులై యసత్యభాషణశీలురై యకార్య చరణాసక్తులైన నీచజాతిమనుష్యులఁ బెద్దగఁ జేసి వేయు శిరములచే భూభారమువహించు నాయెదుర నవాచ్యంబులఁబల్కు నీనాలుక వేయివ్రక్కలుజేసినను దోషమగునా ? ఏమనుచుంటి ?

మ॥ తన పూర్వార్జితమైన పుణ్యమునఁ బా ♦ తాళంబు బ్రాపించుగా
కనయం బన్యధనాపహారులకు నో ♦ హో భోగసిద్ధి మాన్గు పూ

మనుజవ్రాతము చేరఁగాఁగలుగునే ♦ మాలోకమునకుఁ జేరి యి
ట్లనిపల్కఁగఁ దలకొంటి వేమిటికి గ ♦ ర్వాంధ్యంబునఁ దుర్మతీ.

చంద్రా—(స్వగతము) నారద కల్పనాపాశబద్ధమగు వింధ్యాచలము వలె నీతఁడంతకంతకు మితిమీఱుచున్నాఁడు. శాంతవచనములచేఁ జక్కఁబడునట్లులేదు. రాతిగుండ క్షమపట్టు గావల యునుగదా! ప్రాణంబులనేని సరకుఁగొనని క్షత్రియకులంబునఁ బుట్టి యీవిషధరునకు నమ్రుఁడనై మూఁగవలె నుండుట పౌరుషమా? (ప్రకాశము)

సీ॥ వక్రగతిఁబూని ద్విజరాజ ♦ వైరమూని
విషముఁగక్కు స్వభావంబు ♦ విడువలేక
బుధజనుల నిందఁజేయఁగఁ ♦ బూనినావు
నీమొగముఁ జూడవచ్చునే ♦ నీచహృదయ!

(అని ముఖముద్రిప్పను)

మంత్రి—(రోషముతో) ఆ. దురాత్మా! యుగాంతసమయ సముజ్జృంభిత సహస్రభానుతేజుఁడగు నీ మహారాజునా దూఱుచుంటివి?

చంద్రా—అధికముగఁ బ్రేలకుము. ఆత్మస్తుతియుఁ బరనిందయు దోషావహమని తెలియక నిష్కారణజనితకోపావేశమున నోటికివచ్చినట్లు కూయు నీకర్కోటకుని రాజని చెప్పుకొనుటకు మీకు సిగ్గెలలేకపోయెనో?

మంత్రి—(చంద్రాంగదునిజూచి) మూర్ఖుఁడా! తక్షక కోపానలంబున నేలఁబడియెదవు. ఈమహారాజుగారిని శరణము వేడికొనుము. బ్రతుకఁగలవు.

చంద్రా—ఛీ, మాట్లాడకుము. ఇంతయవమానముగ జీవింప నన్ను నీవలె ననాథయని తలంచితివా?

తే॥ నిరపరాధుల దండించు ♦ నేర్పెకాని
సాపరాధుల శిక్షించు ♦ శక్తిలేక

యునదయగు భుజంగము నిల ♦ నాశ్రయించు
బ్రతుకుకంటెను వేరు పా ♦ పంబుగలదే.
(తక్షకునిజూచి)

శా॥ తానే సర్వజగంబు కర్తయయి మి ♦ థ్యాభూతమౌ సూత్ర సం
తానంబుల్ సృజియించి తత్పరిచయా ♦ నందంబునన్ వెల్గు నా
ర్యానాథుండ వతంసహీనుఁడగునం ♦ చాత్మన్ భయంబయ్యెఁ గం
దేనిన్ మామక ముష్టిఘాతముల ని ♦ స్సీచ్చోట ద్రుంచింపనో!
(పండ్లుగొఱుకును)

మంత్రి—

ఉ॥ జాలిఁదలంచి నీపలు క ♦ సహ్యముగా మదిదోఁచినన్ గృపా
శాలి భుజంగనాయకుఁడు ♦ శాంతము నన్గనుచున్నవాఁడికన్
ప్రేలకుమో నరాధమ యు ♦ పేక్ష వహింపఁదలంపఁడేని నీ
కూళతనంబునెల్లఁ గొన ♦ గోరునఁ ద్రుంపగ నేర్పునిచ్చటన్.

తక్ష—ఓరీ! వాచాటా! సకల భూభరణ సమర్థుఁడగు నేపాతాళ లోకేశ్వరున కెదురాడుటయన్న నింద్రాది బృందారకులేని వెనుకంజవేయుదురో యట్టి సహస్రశీర్షుని ద్రోలనా భయము లేక ప్రేలఁజొచ్చితివి? ఇంకఁ జాలించి వచ్చినదారిఁబొమ్ము. నీదుర్మార్గత్వముఁగాంచిన నాకరవాలము చలించుచున్నది.

చంద్రా—(తనలో) ఆహా! తనప్రభుత్వము నిత్యమని తలఁచికొంచు నీతఁడిట్టి యజ్ఞానకూపమునఁ బడిపోవుచున్నాఁడు. (ప్రకాశము) బాగుబాగు. ఇప్పటికి నీపెద్దరికము తెలసివచ్చినది. (నవ్వుచు) నీకిట్టి యౌన్నత్యము గలుగుటకుఁ గారణమైన నూహింప వలదా? ఈ రత్నస్థగితమగు సింహాసనము శాశ్వతమని తలంచితివా? ఇదివఱకే పాతాళలోకమును నీవంటివా రెందఱు పాలింపలేదు? ఎందఱు నశింపలేదు? ఈ పాంచభౌతికమగు తనువున్నది నభిమానము వీడిన నీప్రభుత్వమునకు హానికలుగునని

యెంచితికాఁబోలు? సృష్టిస్థితిలయ కారణుండగుఁ బరమేశ్వరుఁడు నీ కీశాసనాధికార మొసఁగినది సాధుజనపీడనమునకే యని యెంచితివా? జగదాధారుఁడగు నుమాపతి నీకీ సహస్రశిరములొసఁగినది సజ్జననిందారూపదోషము భరించుటకేయని భ్రాంతినొందితివా? నీకీ కరపాదములు గలుగుటకు ఫలము పరుల దండించుటయేయని సిద్ధాంతము జేసికొంటివా! చాలు చాలు నీమర్యాదకు గంతస్సమైనది. నీవంటి వంకరనడకగల వానిని సజ్జగఁ జేసికొనటవలనఁ గరుణామయుండగు నారాయణుఁడు పగటివేషగాఁడు కావలసెను. నీవంటి కఠినచిత్తు నాభరణముగా దాల్చుటచే రజతాచలవాసుఁడైనను బరమేశ్వరుఁడు దిగంబరుఁడయ్యెను. నీకీయధికార మొసఁగిన పరమేష్టి పూజాపీఠాఁడై పెల్లగొట్టఁబడెను. అర్థినై వచ్చిన నన్ను బహిష్కరించుటకు మారుగఁ దిరస్కరింపఁ బ్రారంభించితివా? ఇతరుల నిందించిన భగవంతుని దూషించుట కాదా? ఎవ్వని యనుగ్రహమున నీవీయైశ్వర్యమును జెందితివో యట్టి పరమాత్ముఁడు సర్వభూతాంతర్యామియై సుకృత దుష్కృతములకు సాక్షియై యున్నవాఁడని తెలియుము. నోరు కలదు గదాయని దుర్భాషలాడిన దానిఫలము కట్టికుడుపునని నమ్ముము. పురందరాది దేవతావందనీయుఁడగు నిందుశేఖరు నర్చింపవలయుఁగాని ప్రయోజనరహితంబులగు బాహుపంక్తిఁ జూచుకొని గర్వించుటొప్పునా?

తక్ష.—ఛీ దురాత్మా! పాపఫలితచే నుపేక్షించినకొలఁది ప్రేలఁదొడఁగితివా? ఇదే నీప్రాణములఁ గాంచికొనెదను. (పైకురికి ఖడ్గముతో బొడువబోవును.)

(తెఱలో)

ఓ కుండలీశ్వరా! శాంతింపుము శాంతింపుము.

తే. పరమపావనమూర్తి కృ ♦ పాసమేతుఁ
డీశ్వరారాధనాసక్తి ♦ నెసఁగునతఁడు
వధ్యుఁడే నీకు సకలభూ ♦ భారవహన
దక్షుఁడవు నీవు శంకరుఁ ♦ దలఁపవేమో ?

మంత్రి—(విని) మహారాజా ! శాంతింపుఁడు శాంతింపుఁడు. ఏమహాను భావుఁడు మిమ్ము భూషణముగ ధరించునో యట్టి శశాంకశేఖరున కీతఁడు ప్రియభక్తుఁడని యశరీరవాణి నివారింపుచున్నది.

తక్ష—(నిర్విణ్ణుఁడై) ఏమీ, నిజమా ? ఈతఁడు గౌరీపతికి భక్తుఁడా? అకటా ! నేనెంత యనాలోచితముగఁ ద్వరపడితిని. ఈమహాభాగునితత్వ మెఱుఁగక దూరితిగదా ? అమాత్యా ! (చంద్రాంగదుని గౌగలించుకొని) మిత్రమా !

తే. తల ధరింపఁగఁదగిన ర ♦ త్నంబు నొక్క-
గులకరాయిగ దాయంచుఁ ♦ దలఁచి కాలఁ
దన్నితిని నేరమెంచక ♦ దయదలిర్ప
నన్ను క్షమియించుమా ? నర ♦ నాధ యింక.

చంద్రా—అయ్యా ! నాదురదృష్టమునఁ గలిగినదానికి మీ నేరమేమి? తెలియక నాచేసినతప్పు క్షమింపుడు.

తక్ష—ఆభవానీపతి కరుణవలన నీయౌదార్యమెఱిఁగి బ్రతికితిని.

చం—మహాత్మా ! మనుష్యమాత్రుఁడనగు నాయందు మీరు దయఁ జూపుటెంతయు నాతపఃఫలము. నేను తలిదండ్రుల వీడి చాల కాలమైనది. సెల వొసఁగుఁడు, వెళ్ళి వచ్చెదను.

తక్ష—వెళ్ళవచ్చునులెండు. మాయింట నించుక యాతిథ్యము గొనుఁడు. పోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---



రంగము—యమునామార్గము.

(చంద్రాంగదుఁడు ప్రవేశించి)

నేను యమునలోఁ బడి మరణించితినని పౌరులెల్లరు దలంచి నట్లు లీపల్లెవాండ్ర మాటలవలనఁ దెలియుచున్నది. నాయర్ధాంగ లక్ష్మి సీమంతినియు మిత్రుఁడు గౌతముఁడు నేమైరో తెలియదు. వారు మరణించలేదుగదా ? (ఆలోచించి) అట్లగునేని నేనొక్కఁడనే మృతుఁడనై తిననునర్థముగలమాట లాపల్లెవాండ్రేలఁ బలుకుదురు ? కావున నాప్రాణపదము లిరువురును సజీవులుగ నుండిరనియే విశ్వసింప వలయును. సీమంతిని బ్రతికియేయున్నచో స్త్రీలకు సహజమైన సహగమనాచారము పరిభవింపఁబడియుండునా ? ఇంత యన్యాయముఁ జేయుట కాసతికి మనసొప్పునా ? ఈమహాసందేహ మెట్లు దీరఁగలదు? విచారింపఁగా నొక్క చిన్నయూహ మాత్రము గలుగుచున్నది. సౌమంగల్యాభివృద్ధికై తానాచరించు వ్రత మెన్నటికైనఁ దనకు ఫల మొసంగునను నమ్మకము చేతను గురుజన బలాత్కారము చేతను నాదేవి దేహత్యాగము గావించుకొనకుండి యుండును. ఇదియే నూఱు విధముల నిక్కము.

చ॥ జరిగిన సత్యముఁ దెలయఁ ♦ జాలక చిత్తమనేక రీతులన్
బరుగిడుచో నెదోయొకటి ♦ భావమునందున నిశ్చయించి యా
క్కరణిని సంచరింపఁదగుఁ ♦ గాని క్షణంబున కొక్కతీరుగా
మరియుటఁజింతనొందుటయుఁ ♦ బూరుషధర్మమె యెంచిచూడఁగన్

అకనుబడు లతాగృహమున నించుక శయనించి తరువాత నిజముఁ దెలసికొందును గాక. (నిష్క్రమించును.)

(తరువాత సీమంతిని విచారముతో బ్రవేశించును)

నామనోహరునితో వియోగము గలుగకుండుటకై భక్తిశ్రద్ధలతో నేనాచరించు సోమవార వ్రతమెన్నటికైన నాప్రాణపతి నొసంగఁగలదను నమ్మకముతోడను గురుపత్నియగు మైత్రేయినీ

జీవితేశ్వరు నాజ్ఞలేక యీశరీరమును ద్యజించుట దోషావహ మని చెప్పుటచేతను సహగమనముఁ జేయక వారము రోజుల నుండియు మొండికట్టైనె యెట్లో కాలము గడపుచుంటిని. పరమేశ్వరుఁడీ దుర్భర వియోగ సంతప్తహృదయనగు నన్నెప్పుడు కరుణించునో తెలియదు. స్త్రీలకుఁ బతికన్న లోకములో నధికముగలదా ? దైవమా ! ఎవ్వని పాదరజము సోకిన నేనుధన్యనగుదునని తలంచుచుందునో యట్టి నామనోహరునితోడ నే యెడఁబాపుఁ గలిగించితివా ? సకలరాజశుద్ధాంత కాంతలు సీమంతినికన్న నదృష్టవంతురాలుగలదా యనికొనియాడ నిరంతర సోమశేఖర పూజాపరాయణురాలనైయున్న నాకా యీ దుఃఖసముద్ర పతనము ? (నలుదిక్కులఁ జూచుచు)

సీ॥ కటకటా నానాథు ♦ నెటదాఁచితివో నీవు
యమసహోదరి ! చెప్పు ♦ మమ్మనాకు
చంద్రాంగదమహీశు ♦ జాడఁదెల్పిన దిశాం
గనలార ! మీకొంప ♦ కాలిపోనొ
యంగనాజన మనో ♦ హరుని హరించిన
మీకేమిలాభమో ♦ నాకులార !
యబలనీరీతిగా ♦ నల్లాడఁ జేయుట
కాలమా ! నీకేమి ♦ ఘనతయగునొ

తే॥ గహన దేవతలార ! న ♦ గంబులార !
తారలార ! మహామహి ♦ ధారులార !
యవనిపతియేగినట్టి పు ♦ ణ్యస్థలమున
కరసి నను గొనిపోవరే ♦ సరసులారా !

ఆహా

తే॥ ఏమహారాజు జీవించి ♦ యెల్లయెడల
నాకు సంతోష మిడునంచు ♦ నమ్మియుంటి

నతని బలవంతముగఁ దెచ్చి ♦ యమునలోనఁ
గూలఁ ద్రోసితి నాబుద్ధి ♦ కాలిపోను.

ఓయమునా! సకలలోక జీవనాధారురాలవనినమ్మిన మాయెడ విషముగఁ బరిణమించితివా? ఈభరింపరాని వియోగ దుఃఖ మెంతకాలమని యనుభవింపఁగలను? ఇంకనైన నాజీవితేశ్వరుని బ్రసాదింపఁగూడదా? రక్షింపుము. తల్లీ! (నడచుచుండును.)

స్మితి—(ప్రవేశించి) నాతీవ్రశపథ మాలేమ కెట్టియిక్కట్లుగల్గించెను. కోపము తాపము చేటందు రిదియేకాబోలు. సకల లోకోత్తరుఁడగుఁ జంద్రాంగదుఁడు తనకు భర్తయగుట సోమవారవ్రత మహిమవలననే యని నాశపథ మనుకూలమగునట్లు, తన వ్రతము విడువకుండుటచేతఁగదా సీమంతిని కిట్టిదుస్థితిఁ గలిగించితిని. కృత్రిమ దంపతీవేషధారులై నాచేతఁ బంపఁబడిన సుమేధ సామవంతులలో సామవంతునకాజన్మ స్త్రీత్వముఁ గల్పించినందువలనఁ దనకుఁ బతివియోగము సంభవింపఁజేసితిని. చంద్రాంగదుఁడు సమిత్రకళత్రముగ యమునా విహారముఁ గావింపనేగునని తెలసి గాలవ్యుఁడుమున్నగునాశిష్యులచేఁ బల్లెవాండ్రవేషముఁ దాల్పించి చంద్రాంగదు నొక్కనినే యమునలో మునిఁగిపోవునట్లు గావింపుఁడన వారును నట్లేయొనర్చిరి. భర్తృవియోగ దుఃఖితయగు సీమంతినికిప్పుడు నేను స్వయముగా బోధించి నీపతి నొసంగెదనని వ్రతపరిత్యాగముఁ గావింపఁజేయుదును.

(పరిక్రమించి చూచి) వెనుకఁబోయిన తీఁగెకాళ్లకుఁజుట్టుకొనినట్లు విచారముతో నామెయిటేవచ్చుచున్నది. ఈవేళ సోమవారమగుటచే యమునానదికి స్నానమునకుఁగాఁబోలు వెడలుచున్నది. ఆహా.

సీ॥ సతత దీర్ఘోపవా ♦ స వ్రతంబునఁ జేసి
ప్రబలాంగములు వాడి ♦ వత్తలయ్యెఁ
బ్రతివేళ యమునాస్ర ♦ వంతి మున్గుటచేత
భాసిల్లుమోము వి ♦ వర్ణమయ్యెఁ
దైలసంస్కార సం ♦ త్యక్తంబులగుటచేఁ
జక్కఁ దీర్చిన కురుల్ ♦ జడలుగట్టె
కఠినకంటక మార్గ ♦ గమనాగమనమున
మునిగాళ్లు నెత్తురు ♦ ముద్దలయ్యె
తే॥ పతివియోగ సముద్భూత ♦ బహుళదుఃఖ
బాష్పసంతతిచే మోము ♦ భయదమయ్యె
నకట తనసోమవార వ్ర ♦ తాచరణమె
తనకుఁ గష్టంబు లిడునంచుఁ ♦ దలఁపదయ్యె.

పాప మాయబలనుగాంచిన నామనస్సు నీరైపోవుచున్నది. కాని నాయొనర్చిన ప్రతిజ్ఞ యామెనురక్షించుట కవకాశమీయదు. అదుగో నిర్మలమగు హృదయఫలకమునఁ దనజీవితేశ్వరు లిఖించుటకుఁగాఁబోలు మీఁదఁజూచుచున్నది. మిట్టపల్లములఁ బాటించుచున్నట్లులేదు. పడదుగదా (చూచి) పడెపడె. లేదులేదు. కాలు సవరించుకొన్నది. ఏమి యాసంతాపము? ఏమి యాసాహసము. దైవిక మానుషికములగుఁ బ్రతిబంధములు వ్రతనిష్ఠగలవారిని సాధింపలేవనికాఁబోలు నాసాధ్వీమణి నమ్మకము. కానిమ్ము ఈతడవ వ్రతభ్రష్టురాలగునో కాదో చూచెదను. (సమీపించి)

ఉ॥ ఎవ్వరిదానవీవు జల ♦ జేక్షణ! యీగహనాంతసీమ నీ
కివ్విధి గోడుగోడుమని ♦ యేడ్వఁగఁ గారణమేమి? నీమగం
డెవ్వని చేత మ్రందె కుల ♦ మెయ్యది యిచ్చటికేలవచ్చితో
జవ్వని! తెల్పుమా మది వి ♦ చారముమానుమ ధైర్యమూనుమా.

సీమం—(చూచి) ఈమహానుభావుఁడెవరు? నాదుఃఖోపశమనముఁ గావింపవచ్చిన యీశ్వరుఁడాయేమి? (ప్రకాశము) మునీంద్రా! నేనొక నిర్భాగ్యురాలను. నాపతి యమునలోఁ బడిపోయెను. నన్ను రక్షింపుము.

మైత్రే—సాధ్వీ! విచారింపకుము. మాకు నీచరిత్రమెల్ల బోధపడినది. నీమనోహరుఁడు పరమేశ్వరుఁడొసఁగిన యాయువు దీరుటవలన నిందుండ వీలులేక పరలోకమున కేగెను. దానికై చింతించినఁ బ్రయోజనమేమి? లోకయాత్రయందఱకును సహజమేకదా? చచ్చినవారు దుఃఖించినంతమాత్రమున జీవింతురా?

సీమం—(దైన్యముతో) అయ్యో! నాజీవితేశ్వరుఁ డెన్నటికైన జీవించుననితలంచితినే? తండ్రీ! ఇట్లనుచుంటిరేమి!

మైత్రే—ఇంకెట్లనుమందువు. ఎందైనఁ గాలముతీరి యిహసంబంధము వీడిపోయినవారు మఱల జీవించుటఁగాంచితిమే? నీకీభ్రాంతి యేటికి? పరమేశ్వరునకైనను నొసటివ్రాఁత తప్పదన్న మనుష్యులమాటలెందులకు. ఊరడిల్లుము.

సీమ—తాపసోత్తమా! మీమాటలవలన నాహృదయము దహించుకొనిపోవుచున్నది. పతియే దైవమనియుఁ బ్రాణమనియుఁ జరించుఁగాంతలకుఁ బతి వియోగమునకన్న భరింపరానిది వేఱొండుకలదా? సర్వసమర్థులుగదా మీరు. పతినెడఁబాసి కృశించు నాకు మార్గముఁ జూపవచ్చిన సిద్ధపురుషుఁలని మిమ్మాశ్రయించితినే? ఇట్లునిరాశగలిగింతురేల?

మైత్రే—నీవన్నది నిజమేకాని ప్రతిజీవునకును భూలోకమునఁబుట్టి తమతమ పూర్వకర్మముల ననుభవించి వెంటనే యథాస్థానమున కరుగుట విధియైయున్నది. దానికి విపరీతముగ నడువ నెట్టివానికిని సామర్థ్యములేదు. సృష్టికర్తయైనను మృతుఁడగువాని బ్రతికింపనేరఁడు. కొందఱు స్వార్థపరులు వ్రతములనియుఁ దపము

లనియు నేవియో చెప్పి మూఢులనమ్మించి తమయందు గురుత్వము కలిగించుకొందురుగాని మావంటి యుదాసీను లట్టి యసత్యముల విశ్వసింపరు. ఒకవేళఁ జచ్చినవారు బ్రతుకుటకు వ్రతములుగాని మఱియేవికాని కారణములేమైన నెవ్వరును జచ్చుటకుఁ బ్రసక్తియే లేకుండును. దానఁజేసి యమాది పితృలోకములు పాడుగా వలసినదే? కావున నీవీ వ్యర్థమగునాశను వదలుకొనుము.

సీమ—(తనలో) ఈ మహానుభావుఁ డిట్లనుచున్నాఁడేమి? హా! పరమేశ్వరా నన్నేమిచేయఁ దలచితివి? గురుపత్నివాక్యము నిరర్థకమగునా? సత్కార్యములకు సామర్థ్యములేదని చెప్పుచున్నాఁడే. నన్ను బరీక్షఁజేయుటకు రాలేదుగదా? నా పతిభక్తియే నన్ను రక్షింపగలదు.

మైత్రే—అమ్మా! నామాటవినుము. సత్కార్యము లెప్పుడును ముందు రాఁబోవు పాతకముల నశింపఁ జేయునుగాని పూర్వ పాపములఁ బోఁగొట్టలేవు. అనాచారములు మాత్రము నష్టముగలిగింపఁ గలవు.

సీమ—(తనలో) ఈ విపరీతోపన్యాసమెందులకు? (ప్రకాశము) తండ్రీ నాకీ వేదాంతార్థములు తెలియఁగలవా? మీబిడ్డవంటి దానను. నాకుఁ బతిబిక్షఁబెట్టి రక్షింపుడు. (పదములఁబడును.)

మైత్రే—(తలయూచి) సతీ! నీకభయమిచ్చితిని లెమ్ము. నామాటల వినుము.

సీమ—(అంజలిబట్టి నిలుచును.)

మైత్రే—నీకిట్టి దుఃఖము గలుగుట కనాచారమే కారణము. కావున నేఁజెప్పినట్లు దానిని బరిత్యజింతువేని నీపతి బ్రతుకగలఁడు.

సీమ—తండ్రీ! నాకింతకన్నఁ గావలసినదేమిగలదు? నాయందేదియేని యనాచారమున్న సవరించి మన్నింపుఁడు.

మైత్రే—సౌధాంతరముల సువర్ణడోలికలందుఁ బరిచారికా సహస్రము సేవింప సుఖింపఁదగిన నీదివ్యశరీరమును తెలియ కెవరో మూర్ఖులు జెప్పినమాట విని సోమవాసరవ్రతమని యుపవాసములచే శుష్కింపఁజేయుట యనాచారమగునా కాదా? వేళకుఁదగిన యాహారమిడక జీవుని హింసించుటకన్న వేరొండు మహానరకము గలదా!

సీమ—(తనలో) ఇదేటిధర్మము? ఇదెక్కడిమతము? గురూపదిష్టమగు వ్రతమునే దోషావహమని పల్కుచున్నాఁడు? (ప్రకాశము) మునీంద్రా! సద్వ్రతములు లోకరి కాచరణీయములనియు మఱియొకరికి నిషేధములనియు నెందైనఁ గలదా? దేని యభివృద్ధికై మానవతులు ప్రాణత్యాగమునకైన వెనుదీయరో యట్టి మాంగల్యమునకును వ్రతాచరణమునకును సంబంధము గలిగింతు రేల?

మైత్రే—ఆడుదానవు నీవు ధర్మసూక్ష్మము నెఱుంగఁగలవా? అనాచారదోష మెంతటిపనినైనఁ జేయఁగలదు. కావున నామాట విని వ్రతమును బహిష్కరింపుము. నీమేలుఁగోరి చెప్పు నన్ను విశ్వసింపుము. వ్రతాచరణము దోషముగాదేని యిట్టి యవస్థ నీకెందులకు గల్గెనో యూహించుకొనుము.

సీమ—(తనలో) నిక్కముగా నీతఁడు నన్ను వ్రతభ్రష్టురాలుగఁ జేయ నెంచి వచ్చిన వంచకుఁడే? లేదేని యీవింత యెందైన నుండునా? (నిదానించి) ఎట్టివాఁడైననేమి. ఈతని వలన నా పతి జీవించునుగదా, కాదు కాదు. నేను నా వ్రతమును బరిత్యజించినచో నా మనోహరుఁడు జీవించుననిగదా యీతఁడు జెప్పినది. వ్రతభ్రష్టులకు మనోరథసిద్ధి యగునా? కావున నా మనోహరుని దర్శనము లభించుటకై వ్రత మొనర్పవలసినదే కాని విడువఁగూడదు. వ్రతాచరణ మనర్థక మగునా? వ్రతదేవత

లనమర్థులా? (ప్రకాశము) మహాత్మా! నిష్కారణముగ నన్నేల వ్రతభ్రష్టురాలిని జేతురు. దాన మీకేమిఫలము. నన్ను రక్షింపుఁడు.

మైత్రే—కాంతా! సతులకుఁ బతికన్న నెక్కువకలదా? పతి సహాగమమునకన్న నీవ్రతమధికమగు ఫల మొసఁగఁగలదా? సెలి యక చెడిపోకుము.

సీమ—(తనలో) ఈతనిమాటవిన్నచో నుభయభ్రష్టత్వము సంభవింపఁగలదు. ఎన్నటికైన నావ్రతమే నన్ను మన్నించునుగాక. (ప్రకాశము) అయ్యా! ఎన్నికష్టములు గల్గినను సహింతును గాని పట్టినవ్రతము విడుచుట నాకిష్టములేదు. తుదకు నా ప్రాణమైన పరిత్యజించెదను. నన్ను మన్నించి పతిభిక్ష మొసఁగుఁడు.

మ॥ తన సామ్రాజ్యమునెల్లఁ గోలుపడి కాం ♦ తాగత్నముగా బల్మి నొ
క్కనికై దాసిగనమ్మిపంచమునియూ ♦ జ్ఞగా దాస్యముగా సల్పుచుగా
దనయుం డస్తమయంబు నొందినను స ♦ త్యస్థైర్యముగా సద్వ్రతం
బును సాధింపఁడె యాత్రిశంకుసుతుఁ డం ♦ భోరాశి గంభీరుఁడై.

మీవంటి సమర్థులిట్టి యకార్యమునకుఁ బూనుట తగునా? తండ్రీ! ఈజీవచ్ఛవమును దరింపఁజేయుఁడు. (పదములఁబడును)

మైత్రే—(స్వగతము) ఆహా! ఏమి యీమెవ్రతనిష్ఠ. పతివియోగము గలిగినను, రాజ్యము శత్రువులపాలైనను, కలుగరాని యిడుమలు గలిగినను తన నిశ్చలత్వమునకు భంగమురానీయక సోమవారవ్రతమే తనను రక్షించునని నమ్మియున్నది. ఇఁక నా శపథమెట్లు దీరఁగలదు. ప్రళయాగ్నినిఁ ద్రావఁగోరిన మిడుత వలె నావినాశము నేనే గావించుకొంటినే? (ప్రకాశము) ఓసీ! అనాచారశీలా! నీమేలుగోరి సదుపదేశముజేసిన నామాటఁ దిరస్కరింతువా? ఛీ. నీముఖముజూడరాదు. తొలఁగుము.

ఇంకను నీకుమంచిరోజులు రానట్లున్నవి. (కాలితోఁదన్నిపోవును)

సీమ—(మెల్లనలేచి) ఈవంచకుఁడు నాకు మేలుచేయకున్నను కీడొనర్పలేదు. ఇక్కడికి నేనదృష్టవంతురాలనే? ఈతఁడెవరో నావ్రతము భంగముజేయఁ గంకణముదాల్చి వచ్చినట్లున్నాఁడు? నాపతియే యెన్నటికైన నాకు దర్శనమొసఁగఁ గల యదృష్టమున్నచో నెందఱుదుర్మార్గులైనను నావ్రతమును భంగముఁగావింపలేరు. (నడచుచు ముందుజూచి) అదేమీ నిరంతరవివిధతరుపలాశపరిచ్ఛన్నమై సూర్యకిరణములనైనఁ జొరనీక గాఢాంధకారపూరితమైన లతాగృహంబున నలుదిక్కులను బంగరుకాంతుల వెదజల్లుచు మనోహర పుష్ప సౌగంధ్యయుక్తమై వెలుఁగు గానవచ్చుచున్నది? ఆహా! యెన్నడును గానలేదే? పరిశీలించి జూచెదను. (నడచుచుండును)

చంద్రా—(మెల్లగాలేచి) అబ్బా! ఇప్పటికి నా మార్గాయాసము తీరినది. ఎక్కడ పాతాళలోకము? ఎక్కడయమునాతీరము? ఏమి యాతక్షకునిమర్యాద? నాకీజన్మములో మఱుపునకు వచ్చునా? (ఒడలు విరచుకొని) ఆహా!

సీ॥ కలనైన ననుబాసి ♦ నిలువలేదు నెలంత
యీ వియోగంబు స ♦ హించుటెట్లు
కడువార్ధకమున న ♦ న్గాంచి ప్రేమించిన
తలిదండ్రులేవంతఁ ♦ దగిలినారొ
ఏదిక్కులేక న ♦ న్నే యాశ్రయించిన
స్నేహితుండేవంకఁ ♦ జేరినాఁడొ
ఇదిగొ వచ్చెదనంచు ♦ నిల్లైతి నైషధ
శ్రీ మేదురాత్ముని ♦ చేతఁబడెనొ

తే॥ పరిణయంబైనదాదిగా ♦ బట్టణమున
కరుగఁ బయనంబొనర్చిన ♦ యప్పుడెల్ల
మమ్ము నిలపెడి యత్తమా ♦ మలను నెట్టి
యిడుమలనుగల్గెనో యెట్టు ♦ లెఱుఁగువాఁడ.

ఇదే నగరమార్గమున్నట్లున్నది. ఎవరేని మార్గస్థు లగుపడిన పురివిశేషము లడిగి తెలసికొనెదను. (నడుచుచు సీమంతిని గాంచి) ఆకన్యయెవరు? నాహృదయేశ్వరియా? ఆహా! ఎంతటిపుణ్యము (చూచుచు నిశ్చేష్టుఁడై నిలచియుండును)

సీమం—(చంద్రాంగదునిజూచి) ఈమహారాజెవరు? (సంతోషముతో) ఆహా! నావ్రతము ఫలించినది. నామనోహరుఁడే? అవును. హా! హృదయేశ్వరా! (కౌగలించుకొనును)

చంద్రా—హా మనోహరీ!

తే॥ సతత మస్మద్భుజాంతర ♦ స్థాయివగుచు
మామక సమస్తసుఖజన్మ ♦ భూమివగుచు
స్వప్నముననైన నన్నెడఁ ♦ బాయునట్టి
యువిద నినుబాసితిని దైవ ♦ యోగమునను.

కాంతా నీశరీరమిట్లు కృశించినదేమి?

తే॥ పోతఁబోసిన బంగారు ♦ బొమ్మకరణి
దెలివ! మిరుమిట్లుగొల్పు నీ ♦ దేహమెల్ల;
మంచులోనున్న పద్మంబు ♦ మాడ్కి చెన్ను
దఱిగియున్నది యేమిటి ♦ కెఱుక బఱుపు.

య వ ని క జా రు ను

ఇదిషష్ఠాంకము.

---



శ్రీ మీనాక్షైనమః

# సీమంతినీ నాటకము



## సప్తమాంకము.

(రంగము- యుద్ధభూమి- గౌతముఁడు ప్రవేశించి)

అబ్బా! ఇట్టిఘోరయుద్ధమును నాజన్మములో నెన్నఁడైనఁగాం
చితినే? నిశితశరసంఘాతములచేతఁ బ్రత్యర్థిసైన్యములఁ
బీనుఁగుపెంటఁ గావించుచు శాత్రవప్రయుక్త బాణపరంపరల
నుగ్గాడుచుఁ జంద్రాంగదమహారాజు తారకసంహారోన్ముఖుఁడగు
గుమారస్వామివలె రణరంగమున నెట్లుప్రకాశించుచున్నాఁడు?
ఆహా! సీమంతినీదేవి యదృష్టమేమని చెప్పవలయును? కనుక నే
యమునలోఁబడియు మాచెలికాఁడు పాతాళలోకేశ్వరుఁడగు
దక్షకునివలన గౌరవింపఁబడి రాఁగలిగెను. కానిఁ యెప్పుడా
సోమేశ్వరుఁడు నామనోహరుని దర్శనముగలిగించునా యని
యనేకవిధముల నిద్రాహారముల విడచితపించు సీమంతినికిఁ
జంద్రాంగదుఁడు కన్పడుటయే తడవుగ నీపాడుయుద్ధమొకటి
సంభవించెను. చంద్రాంగద మహారాజరుణాస్పదపురమునుండి
సైన్యములతో యుద్ధమునకువచ్చుచుఁ జిత్రవర్మమహారాజుగారి
కుటుంబమును సీమంతినీదేవిని నీవెంటగొనిరమ్మని చెప్పుటచే
వారినందఱను దీసికొనివచ్చి యీనైషధపురమందలి యొకసత్ర
ములోనుంచి మీయాజ్ఞనెరవేర్చితినని చెప్పుటకై యిచ్చటికి
వచ్చితిని. (తెఱలో)చాపబాణగదాశక్తి భిండివాలతోమరము

సత్ప్రాసపరిహాపట్టు సాద్యాయుధపాణులగు నోమహావీరాను లారా! పరమార్తాండమండల కబళనపాండిత్య రాహువగు నైషధాధిపతి యిదె శత్రురాజమత్తేభంబుల మీఁదికుఱుకుచున్నాఁడు. మీమీవ్యూహములఁ జక్కఁగాఁ గాపాడుకొనుఁడు.

గౌత—(వినుట నభినయించి) అదిగో మాచెలికాఁడు గర్వోద్రిక్తులగు శత్రుచమూపతుల మార్తాండుని రక్షించుకొనుఁడని బీరంబులఁ బల్కుచున్నాఁడు.

(మఱలఁదెఱలో)

మ॥ సకలారాతిభయంకరంబయిన య♦ స్మద్బాహుశౌర్యాగ్నికో
ర్వక సుక్షత్రియవీరయోగ్యమగు మ ♦ ర్యాదన్ విసర్జించి మా
మకరాజ్యంబను ముట్టడించితె యహం ♦ భావంబునన్ శూరయో
గ్యకలానుర్వ్యఁడితంసు లేనియెడ నీ ♦ వయ్యర్ధరాత్రంబునన్.

గౌత—(విని) పరసైన్య వినాశనముఁ గావించి యదిగో యింద్రసేన కుమారుఁడు కమలాపురీశుని వెన్నంటి యిటేవచ్చుచున్నాఁడు. ఆదుర్మార్గునకది నేఁ తగినశిక్ష. ఇఁక నేనిందుఁడరాదు. ఆవీరుని బాణ మొకవేళదురదృష్టవంతుడనగు నాపైఁబడియెనా చావవలసి వచ్చును. ఈవేళ బ్రాహ్మణార్థముఁగూడ నియమించుకొంటిని.

(నిష్క్రమించును)

(ఇది యంకావతరణము)

(తరువాత శరాసనహస్తులై చంద్రాంగ మార్తాండులు ప్రవేశింతురు)

మార్తాం—క్షత్రియకులాపశద! ఇదుగో నీపాలటిమృత్యువగు మదీయ శరప్రహారమున కోర్చుకొనుము.

చంద్రా—(తప్పించుకొని) దురాత్మా! నోటికివచ్చినట్లుల వాగెదవు. నీపరాక్రమ మొక్కబాణ ప్రయోగముననే గాంచితిని. నాకు



ప్రత్యర్థివై నీవు ప్రాణంబులతోఁ బోగలుగుదువేమో చూచు కొనుము.

మార్తా—

శా॥ ఓరీ రాజకులాధమా! యిటుల గ ♦ ర్వోక్తుల్ ప్రసంగింప నీ
కేరీతిన్ మది సిగ్గులేదు సతతం ♦ బిష్టాన్న సంతృప్తి చే
నారీమండల మధ్యవర్తివయి యా ♦ నందించు నీవేడ దు
ర్వారాభీల శరప్రపూర్ణమగు సం ♦ గ్రామం బిదేర్లా ఖలా!

చాలు నీగంభీరోక్తులు. నీవు మహాయోధుఁడవు గనుక మదీయ దండయాత్రా ప్రస్థానమెఱిఁగి శ్వశురాలయమున డాఁగితివి.

ఆ॥ బాలకుండవీవు ♦ బాలడు యుద్ధంబుఁ
జేయ వయసునీకుఁ ♦ జెఱుగయింకఁ
గొడుకులేని కొఱఁత ♦ యిడక నీపితరుల
శోకయింపు మనద ♦ యటుల నన్ను.

చంద్రా—ఛీ! దుష్టా! దొంగవలె నంధకారబంధురమగు నర్ధరాత్రమున నగరమునఁ బ్రవేశించిన నీపరాక్రమము నాకుఁ గ్రొత్తయా?

శా॥ చాలుంజాలును నోరుమూయుమికఁ నీ ♦ చా! యింద్రసేనకుమా
పాలుండాహవసీమఁ దావక పుర ♦ ధ్వంసంబు గావించుచో
నాలీలన్ బ్రతిమాలి నిల్పికొని రా ♦ జ్యం బిప్పుడీలాగునన్
బ్రేలంజొచ్చితివీవు నవ్వుదురు నీ ♦ బీరంబుగన్నన్ జనుల్.

మార్తాం—ఓరీ! గ్రుడ్డువచ్చి పిల్లనెక్కిరించినట్లు నాకన్నులముందర బుట్టిన నీవా నన్నెదరింపువాఁడవు.

చంద్రా—(మార్తాండుని కేశములఁబట్టి పడద్రోసి మీఁదగూర్చుండి కత్తినెత్తి)

మ॥ ప్రతిపక్ష ప్రకర ప్రతాప పనసు ♦ భద్వీతిహోత్రం బనుం
జిత మస్మత్కరవాలమియ్యది యహం ♦ తీనాథ ముఖ్యావనీ
పతిగర్వంబు హరించినట్టుల భ ♦ వత్ప్రాణంబులన్ గోరి యుం
చితరీతిన్ జెలువారు గన్గొనుము దు ♦ శ్శీలాఘులధ్వంసకా !

సంకల్పమాత్రవినమితసకలశాత్రవ శిరోమండలుండగు నింద్ర
సేన మహారాజుగారి సింహాసన మెక్కునంతటివాఁడవా ?

చ॥ కలిగినమాత్రఁ దృష్టిఁబడి ♦ కాలముఁబుచ్చఁగలేక తస్కరుం
బలె నగరంబుఁజొచ్చి పరి ♦ పంథి యితండు సరించెనంచు లో
దలఁచి యకారణంబ తలి ♦ దండ్రుల బాధనొనర్చుదానికై
ఫలమిదెనీకు నేఁడనుభ ♦ వంబగుచున్నది గాంచుదుర్మతీ !

తే॥ తావక ప్రాణహరణ వి ♦ ద్యాగురుం డి
తండు లేకుండు నెడ నైష ♦ ధంబుఁగొంటి
విపుడు నా ప్రోలనే వరి ♦ యింపు మింక
శమన పురరాజ్యలక్ష్మి సం ♦ శయము విడచి.

ఇదిగో దమయంతీ మనోవల్లభ శిరోవిరాజితంబగుఁ గిరీటము
ధరింపఁగోరు నీమస్తకమునకుఁ దగిన ప్రాయశ్చిత్తము. (శిరము
గోయును)

యవనిక జారును

రంగము—పట్టాభిషేక మందిరము
(చంద్రాంగదుఁడు, చిత్రవర్మమంత్రి, గౌతముఁడు, ఇందుకళ,
సీమంతిని ప్రవేశము)

చిత్ర—(తనలో)

ఉ॥ గోవధమున్ బ్రధానముగఁ ♦ గోరిమొనర్చెడి మ్లేచ్ఛుఁడున్ బలెన్
జీవునకొక్కవేళ బలు ♦ చింతలఁగూర్చు మఱొక్కవేళ సం
భావనఁజేసి యాతనికి ♦ స్వర్గసుఖంబు నొసంగుచుండు నౌ
రా విధిచిత్రముల్ దెలియ ♦ రావుగదా యెటువంటివారికిన్.

(ప్రగాశము ఇందుకళనుగాంచి) ప్రాణేశ్వరీ! మనయమ్మాయి సౌశీల్యమును గాంచితివిగదా? అవ్యాజానురాగమునఁ గోరి కొనిననాథునితో వియోగముగలిగినను దన నియతవ్రతమునకు భంగమురానీయక మృతుఁడైన పతినిఁబడయఁగలిగినది.

ఇందు—అందువలననేగదా మనకిట్టిసంతసము గలుగనైనది. యమ లోకంబునకఱిగిన సత్యవంతుని సావిత్రియుఁ, బాతాళమున కరిగిన చంద్రాంగదుని సీమంతినియు సాధించుకొనిరని భవిష్య ల్లోకము వేనోళ్లఁ బొగడఁగలుగుభాగ్యము వీరిరువురకే.

తే॥ ఏతపం బొనరించితి ♦ మేవ్రతంబు
నాచరించితి మో ధన్య ♦ మైనపుత్రిఁ
బడసి యుభయాన్వయముల బా ♦ వనముగాగ
నధిక సంతోషవార్ధిలో • నలరమనకు.

చంద్రా—మామగారూ! పూజ్యులగుఁ దలిదండ్రులయొక్కయు మహానుభావులగు మీయొక్కయు నాశీర్వచన ప్రభావమే ఇది.

మధు—(ప్రవేశించి) అయ్యో! ఎంతయన్యాయ మెంతయన్యాయము.

సీమ—అదేమి అట్లుబలుకుచుంటివి?

మధు—అమ్మా ఏమనిచెప్పఁగలను. ఎవరో దుర్మార్గులు నీవ్రతమును భంగముఁజేయుటకై కృత్రిమదంపతీవేషమున నీచేఁ బూజింపఁ బడిరఁట.

సీమ—(ఆతురతతో) ఆ! నీకెట్లుదెలిసెన?

మధు—వీధిలో నందఱు ననుకొనుచుండిరి.

సీమ—(స్వగతము) ఆహా! ఎంతయన్యాయము సంభవించెను. ఎన్ని కష్టములు గల్గినను దేనిని విడనాడక యాచరించుచుంటినో యేయమోఘమగు వ్రతాచరణమువలన మృతప్రాయుఁడైన నాపతినిఁ బడయఁగలిగితినో శత్రుగతమగు సర్వరాజ్యము దేని వలనఁ జేపడెనో యట్టి నావ్రతమే భంగమయ్యెనా? ఇప్పుడే

కదా నాకష్టములు తీరెననితలఁచితిని? ఇంతలోనింతవిరుద్ధమా
(చంద్రాంగదుని జూచి ప్రకాశముగ) జీవితేశ్వరా! నేఁటితో
నాకు మీఁదాస్యముఁ జేయుభాగ్యము తీరినది. నాకాజ్ఞ యిడుఁడు.
తలిదండ్రులారా! నాకై మీరు దుఃఖింపకుఁడు. ఓదైవమా!
నాకురాఁగల జన్మమునఁగూడఁ జంద్రాంగద మహారాజునే
పతిగను మైత్రియినే గురుపత్నినిగను దయసేయుము. నేనీశరీర
మునకు విశ్రాంతి యొసఁగెదను. వ్రతభ్రష్టురాలను నిందభరింప
జాల. (జడతో నురివేసికొనఁ బోవును.)

ఇందుకళ—అయ్యోతల్లీ నీకెట్టి దుర్దశగల్గెను. హాదైవమా మాయం
దింత కాఠిన్యమా. (సీమంతినిని కౌఁగలించుకొని)

సీ॥ పాతాళమునకేగి ♦ బ్రతికివచ్చెను నీదు
పతియంచు సంతోష♦పడితిమమ్మ
అంధులై యల్లాడు ♦ నత్తమామలఁగొల్వ
గలిగితివని హాళి ♦ గంటిమమ్మ
శాత్రవుల్ గొనిన రా ♦ జ్యంబు సర్వమునొనఁ
గూడెనంచును వేడ్క ♦ గొంటిమమ్మ
సోమవార వ్రతం ♦ బే మాకు శుభములఁ
నొసరించునని నమ్మి ♦ యుంటిమమ్మ
తే॥ కటకటా యిప్పుడే కడ ♦ గండ్ల బాసి
నారమని సంతసముజెంది ♦ నారమమ్మ
యిట్టివెతఁగల్గుననుచు మే ♦ మెంచమమ్మ
మమ్మువిడనాడిపోవ ధ ♦ ర్మంబెయమ్మ.

చిత్ర—హా! తనయా నీకింత సాహసమేల? మాకేమిగతిఁజూపితివి? అయ్యో!
మాప్రాణములన్నియు నీమీఁదనే బెట్టుకొంటిమే?

మ॥ చిరకాలంబును సంతతిన్ బడయఁగాఁ ♦ జింతించి మైత్రేయి స
త్కరుణన్ గల్గితివంచుమాకు గతులన్ ♦ గల్పింతువంచాసతో

పరివారిఁ దలలెత్త గల్గితిమి మా ♦ సంతోషముల్ నేలఁగూ
ల్చి రయంబీగతి దేహముల్ విడువఁగా ♦ సీమంతినీ చెల్లునే.

ఆహా! నాజన్మము దుఃఖములతోడనే గడచుచుండెగదా ?

మైత్రేయుఁడు—(పరుగెత్తుకొని వచ్చి) సుమంగలీ! ఆగుమాగుము.
నీవ్రతము చెడలేదు నాకేపగాభవమయ్యెను. (అందరునివ్వెర
గంది చూచుచుందురు).

సీమం—నన్ను నివారింపకుఁడు

మైత్రే—(స్వగతము) హా! దైవమా!

చ॥ నలుగురిలోనఁ గెల్తునని ♦ నావచియించినమాట రిత్తగా
వలసెను సోమవంతునకుఁ ♦ బాయని స్త్రీత్వము సంఘటిల్లె దు
ర్బలుఁడగు వైరిమ్రోల ♦ దలవంపులుగల్గె నికేమిసేయఁగా
దలఁచెద ప్రాణముల్ విడువ ♦ ధైర్యమొనర్చెడి గాంతయక్కటా.

నాకీభరింపరాని స్త్రీహత్యయు మెడఁగట్టెదవా?

సీమ—(అంజలిబట్టి)

దండకము.

శ్రీశాదిముఖ్యామర శ్రేష్ఠులైనన్ భవత్పాద పద్మంబులన్
భక్తితో నిత్యమున్ గొల్చియుష్మద్వ్రతంబాచరింపంగలేరన్నచో
నిష్ట మృష్టాన్నసంతృప్తి దేహాభిమానంబునన్ బాపముల్
జేయుచున్ సౌఖ్యమే ముక్తిగా నెంచుచున్ మాయచే బద్ధులై
పూర్వ జన్మార్జితంబైన పాపంబుచే దుఃఖమున్ బొందుచున్
నెంటికిన్ గాకయంత్యంబునన్ గాలపాశంబుగంఠంబుబంధించి
యీడ్వంగ మొర్రోయటంచేడ్చు మావంటి వారెంతవారో
మహాదేవ! ఏమైననుఁగానిమ్ము నీసేవయే నాకుగర్తవ్యమంచెంచి
యున్నట్టి నీదాసురాలిన్ గటాక్షించి మన్నింపకీరీతిగా మద్వ్ర
తంబున్ బరీక్షింపనే స్థైర్యమున్ దాల్పగానేర్తునే? భావిజన్మం

బునఁగూడ నీసోమవారవ్రతంబె వ్రతంబౌనటుల్ నైషధానిశుఁడే జీవితేశుండుగాఁజేసి నన్నింక నీసన్నిధానంబునకా దేవ్యోమ్మాయుమా చిత్తవాసా నమస్తేనమస్తే

శంకరుఁడు నందివాహనారూఢుఁడై ప్రవేశించి)

సాధ్వీ! ఈసాహసమేమి

తే॥ వ్యర్థముగనేల నీతను ♦ త్యాగమునకుఁ
బ్రతినబూనెదు వలదు స ♦ ద్వ్రతముచెడునె
మనుజమాత్రులోనన్బడి ♦ మాయచేతఁ
జంద్ర సూర్యులు గతిదప్పి ♦ చనినఁగాని.

సీమ—(చూచి) ఆహా! వ్రతాధిదేవతసోమశేఖరుఁడే! నేనెంతధన్యరాలను. (శంకరుని పాదములఁబడి) తండ్రీ! రక్షింపుము రక్షింపుము. నీదాసురాలను బ్రహ్మాదులకేని గోచరింపని నీదివ్యమంగళస్వరూపమును నాపూర్వపుణ్యమునఁ గాంచిధన్యనైతిని. (అందరు శంకరునకు నమస్కరింతురు)

శంక—సాధ్వీ నీవ్రతముఫలించినది. నిన్నువంచింపఁబూనిన సుమేధసోమవంతులకే పరాభవముగలిగెను. ఆయుష్మంతులయినయెనమండ్రు పుత్రులనుగాంచి వర్ధిల్లుము. (చంద్రాంగదుని గాంచి) వత్సా! పరంపరాగతమయిన సింహాసనమధిష్ఠించి సహస్రవర్షములు రాజ్యమేలుము. సోమవారవ్రత ప్రభావమున నన్నియు సమకూడెనుగదా! మఱియు నేమికావలయును. అయిన నిట్లగుగాక.

సీ॥ యమునాజల నిమగ్నుఁ ♦ డగు ప్రాణపతి జీవ
ముల నిల్పగల్గె నే ♦ లలన చరిత
యంధులైె కానల ♦ నల్లాడు నత్తమా
మలఁ బ్రోవఁగలిగె నే♦ కలికి చరిత

వంశద్వయంబు బా ♦ వనమొనర్చి జగాన
శాశ్వతంబయ్యె నే ♦ సాధ్వి చరిత
కష్టంబు లెన్నని ♦ గల్గిన గురువాక్య
మాదలఁ దాల్చె నే ♦ యతివ చరిత
తే॥ భోగ మోక్షప్రదంబునై ♦ పూతమగుచుఁ
సకలశుభమః లొసర్పంగ ♦ జాలినట్టి
తనరు సీమంతినీ చరి ♦ తము సతంబు
ధరణి వెలసెడి నాచంద్ర ♦ తారకముగ.
మఱియును—

చ॥ సతతము భూమిపాలకులు ♦ క్షత్రియధర్మము వీడకుంద్రు గా
వుత సతులై లతాంగులు ప్ర ♦ భూతయశంబు గణింత్రుగావుతన్
క్షితిపయి నీతిబాధలు న ♦ శించుత మెప్పుడు సోమవాసర
వ్రత మొనరించి యెల్లరును ♦ వారని సౌఖ్యము లొంద్రుగావుతన్.
అందరు—తథాస్తు. తథాస్తు.

—* గ ద్య ము *—

సీ॥ ఏమహామహుఁడు శ్రీ ♦ వేమనారాధ్య వం
శాబ్ధికిఁ బూర్ణ శ ♦ శాంకుడయ్యె
నేతల్లి సావిత్రి ♦ కెనయై సతుల్ మెచ్చ
మహినిఁ బాతివ్రత్య ♦ మహిమఁగాంచె
నట్టి నందయకు గా ♦ రమగు ద్వితీయ పు
త్రుండఁ గౌండిన్య గో ♦ త్రుండ దక్షి
ణామూర్తికిని శివా ♦ నందునకును సోద
రుండఁ గూరిమి యజ్ఞ ♦ జుండ సుబ్బ
తే॥ నార్యునకుఁ బ్రాతుఁడను మదీ ♦ యమగు మోక్ష
దంబు సీమంతినీ నాట ♦ కంబునందు
నమలమైయొప్పు నేడవ ♦ యంకమయ్యె
సతము దీనినిరక్షించుఁ ♦ జంద్రమౌళి.

శ్రీ శ్రీ శ్రీ



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B195 |
| పుస్తకం పేరు | సీమంతినీ నాటకము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 121 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |